ఆంధ్రభూమి

సంట : ౯. వృష, భాద్రపదము : సెప్టెంబరు, 1941. సంచిక : ౧౧.

# ఇరాన్ దేశపు ఆచారాలు

అత్తరుకు, పెట్రోలు మొదలగు నూలులకు, రత్నకంబళ్ళకు ప్రసిద్ధిగాంచిన పూర్వపు పర్షియా దేశమే ఇప్పుడు ఇరాన్ దేశముగా వ్యవహరింపబడుతో వుంది.

ఒకప్పుడు హిందూదేశాన్ని జయించి నెమిలి సింహాసనాన్ని కూడా పట్టుకుపోయిన నాదర్‌షా పాలించిన పర్షియా— ఈ మధ్య దాని మందకొడి తనంవల్ల పొరుగు రాజ్యాలైన బ్రిటన్, రష్యాలు ఆ దేశమును తాత్కాలికంగా ఆక్రమించుకోవలసి వచ్చింది.

ఇరాన్ దేశపు విస్తీర్ణం 6,25,000 చతురపు మైళ్లు.

జనాభా 15,000,000.

ఇరాన్ ముఖ్యపట్టణం టెహరాన్ ఇప్పుడు రిజాఖాన్ దానికి పాదుషా. హిందూదేశాన్ని జయించి నాదర్‌షా ఎత్తుకుపోయిన నెమలి సింహాసనం నేటికికూడా టెహరన్‌లో వుంది. పర్షియా ప్రభువులందరు దానినే అలంకరిస్తారు.

ఆ దేశస్థులు బలాఢ్యులైనా మండకొడిగా వుంటారు ఎంతటి జరుగురు కార్యమైనా రేపు చూచుకోవచ్చులేఅని నానుస్తారు.

ఆ జబ్బుచేతనే రష్యా బ్రిటన్ దేశాలు ఇరాన్‌లో జర్మనులు పాదుకొంటున్నారు అరికట్టమని జాబులువ్రాస్తే వాటిని పెడచెవిని పెట్టారు, కాగా బలవద్రాజ్యాలైన బ్రిటన్ రష్యాదేశాలు ఇరాన్‌ను ఆక్రమించక తీరిందికాదు.

ఒక నిర్ణీత కాలంలో ఫలానా పని ముగించాలి లేకపోతే పరిస్థితులు విషమిస్తాయన్న సంగతి వారికి లేదు. కాగా వారికి గడియారాలతో ఎట్టిపని వుండదు: వీరి సోమరితనాన్ని పట్టి మనలో సోమరిపోతులను 'నవాబుదర్బార' నడం పరిపాటి అయిపోయింది.

నాలుగు గంటలకు శాసనసభ సమావేశం అవుతుందని సరక్యులర్ పంపితే సభికులు ఏ ఆరుగంటలకో చేరుకుంటారుట అట్టి ఇరాన్ ప్రజల ఆచారవ్యవహారాలు ఆదేశపుస్త్రీల ఘోషా పద్ధతులు తెలుసుకోడాని చాలా ముచ్చటిగా వుంటుంది.

ఇరాన్ దేశంలో పిల్లపుట్టిడమనేది ఒక పెద్దతతంగమన్న మాట. ఆగ్రామంలో వున్నవారందరికి ఆ రోజు సండడిగా వుంటుంది. కనడానికి సిద్ధంగానున్న తల్లిని ఆ వూరి వాడల స్త్రీలం దరువచ్చి చూచి ఆశీర్వదించిపోతారు. మక్కా చూచివచ్చిన ఒక వృద్ధ స్త్రీ ఆమె ప్రకను పీటవేసుకూచుని ఏవేవో మంత్రాలు చదువుతో వుంటుంది. అవూరి మతగురువు (ముల్లా) ఆ ప్రక్కగదిలో కూచుని కురాన్‌లోని మంత్రాలు పఠిస్తాడు. పురుటిగదిగా నిర్ణీతమైన గది తలుపులన్నీ వేసేస్తారు. ఒక మూల ఒక చిన్న ఆముదపుదీపం కాని లేక కొవ్వొత్తిగాని వెలిగించి పెగతారు. కణకణలాడే నిప్పులు తెచ్చి సుగంధద్రవ్యాలు ధూపం వెసి అగదిని అంతా నింపుతారు. అందులో కనబోయే అతల్లిని కూచోబెడతారు. గది చాలా శుచిగా శుభ్రంగా వుంచుతారు బైటి ధ్వనులేమి లోపల వినబడకండా చూస్తారు. కుమారుడుపుడితే కొండ

ఎక్కినట్టుగా భావిస్తారు.

పుట్టినబిడ్డను ముల్లాదీవించి మరీ వెడతాడు. ఎంతలేనివారైనా అ దేశంలో పుట్టిన పసిపాపని పన్నీటితో జలకమాడిస్తారు.

పసిబిడ్డకు మొదటి మూడు రోజులు వట్టి అవునెయ్యనే ఉగ్గుగా పెడతారు. అది దొరకకపోతే వనమూలికలచే తయారు చేయబడి కషాయాన్ని పోస్తారు తల్లివద్ద పాలు లేకపోతే యింకోతల్లిచేత పాలు యిప్పిస్తారుకాని పోతపాలు పోయడానికి ఆతల్లులు ఒప్పుకోరు.

నరునికంటికి నల్లరాయి బ్రద్దలగునన్న సామెత వారు విశ్వసిస్తారు. కాగా పిల్లలను పరులకంట పడకండా చూసుకుంటారు. మనవారు అందుకనే పసిబిడ్డ పాడికుండా అందరికి చూపగూడదనేవారు.

పిల్లకు నీళ్లుపొయ్యగానే వంటినిండా అత్తరువేసిన నూని వ్రాసి కళ్ళకుబాగా కాటుక పెడతారు. కనిబొమలకు రంగువేస్తారు. కళ్లు పెద్దవిగా కనపడాలని కన్ను కొలకులలోకూడా నల్లటి రంగు వేస్తారు,

దృష్టి దోషంతగులకండా పిల్లలకు ముల్లాలచేత రక్షరేకులు కట్టిస్తారు.

అదేశీయులు బారిసాల పుట్టివెంటికలు ఒకసారే చేస్తారు. అది సర్వ సాధారణంగా ఏడోరోజున జరుగుతుంది. అరోజున చుట్టాలు పక్కాలు వస్తారు. అందరకు విందు చేసిన వెనుక మతగురువును పిలిపిస్తారు. మంగలి వస్తాడు. పన్నీరుతో తలతడిపి అతి జాగ్రత్తగా గుండు గీకుతాడు.

అ గుండు గీకడంలో నాటుపడితే అపిల్లవాని బుద్ధి తక్కువగుతుందని వారి మూఢవిశ్వాసం. అందుకని ఆరితేరిన మంగలినే పిలుస్తారు. గుండుచేయడం అయినవెనుక ముల్లా అపిల్లవానికి నామకరణం చేస్తాడా. గురువు నలుగురిలోను అ పేరు తెలియజేస్తాడు.

అ ఇరాన్ దేశపు బాలికలు చదువు చాలా విచిత్రంగా వుంటుంది. బాలికలు అందరూ ఒక వృద్ధురాలువద్ద చదువుకుంటారు. యువకులు యువకులమాట వినరని వారి అభిప్రాయం. పిల్లలకు బుద్ధులు చెప్పడంలో వారు ప్రపంచానికి ఒజ్జబంతి. ఎప్పుడూకొట్టకుండా వారిని భయపెట్టి చదువు చెప్పుతారు. అపిల్లలు యింటివద్ద అల్లరిచేయకండా వుండటానికి అ తల్లులు వృద్ధ పంతులమ్మకలసి మార్గాలు అలోచించుకుంటారు పంతులమ్మ పిల్లలను యింటికి పంపేటప్పుడు వారి చేతులలో ఒక గుర్తువేస్తుంది. 'ఇంటివద్ద బుద్ధిగా వున్నావంటే యీ గుర్తు వుంటుంది లేకపోతే పోతుంది.' అని చెబుతుంది. ఆఅమాయికురాలు నిజమేననుకుని జాగ్రత్తగానే వుంటుంది ఎంత జాగ్రత్తగా వున్నా మరునాడు అగుర్తు కనబడకపోతే గాభరపడిపోతుంది. 'నేను అల్లరిచేయలేదని రాసియ్యవే అమ్మా!'అని అతిజాలిగా తల్లినిఅడిగి వ్రాయించుకు వెడతారు. మూఢనమ్మకాలమీద నమ్మకం కలిగించి పిల్లలను మంచి మార్గాల నడుపుతారు కొట్టకండా.

అబద్ధమాడితే నోరు వాసనవేస్తుంది ఆని భయపెట్టి పిల్లలు అబద్ధాలాడకండా చేస్తారుట. అ పిల్ల అబద్ధమాండి నానోరు వాసనగా వుందా అని అడిగితే లేకపోయినాసరే వుందంటారుట అందరూను అకన్ వెన్ షన్ అక్కడ వారికందరకు తెలుసును గనుక.

పెరిషియన్ స్త్రీల దుస్తులు చాలావరకు మన దేశీయులను పోలే వుంటాయి. కాని చీరలుకు బదులు షుర్వాలు ధరిస్తారు. వారు బయటకు వచ్చినప్పుడు నల్లటి బురఖాతో వళుఅంతా కప్పుకుంటారు. అమె బురఖావేసుకుని బయటకు వస్తే అమె భర్తకూడా అమెను గుర్తించలేడు.

స్త్రీలు యవ్వనంలో వున్నట్టయితే వారు దాదినో యిట్లోవున్న ముసలమ్మనో తోడుతీసుకొని వస్తారు బయటకు.

అందంకోసం చాలా శ్రద్ధ తీసుకుంటారు వారు చాలా అందగా వుంటారు కూడాను. ముఖం కోలగా అకర్షణీయంగా వుంటుంది. ముఖాలకు పౌడర్లు ఉపయోగించడం వారికి తెలియదు. వారు స్వయంగా సౌందర్యపోషకద్రవ్యాలు తయారు చేసుకోంటారు.

—౩౫ర-వ పేజీలో చూడు.

# ఆ కాస్త పని···

ఇది దాదాపు ముప్పయి సంవత్సరాలక్రింద జరిగిన అపూర్వ సంఘటన. అప్పుడు మేము మెడ్రాసు క్రిస్టియను కాలేజీలో చదువుతూ వుండేవాళ్ళం.

మా మిత్రబృందంలో సుందరం మినహా అంతా బ్రహ్మచార్లే. సుందరం అప్పటికప్పుడే నిర్భయంగా నూతన భావాల్ని వెలిబుచ్చుతూ, స్త్రీ స్వాతంత్ర్యం, స్వేచ్ఛాప్రేమ వగైరా విషయాలమీద గంభీరోపన్యాసాలిస్తూవుండేవాడు, సంఘ సంస్కారులమని రొమ్ము విరుచుకు తిరిగి, ఆచరణలో ఏమి చెయ్యకుండావుండే పెద్ద మనుష్యులమాదిరి కాకుండా సుందరం తన నూతన సిద్ధాంతాలని ఆచరణలో పెట్టడానికి గట్టిప్రయత్నంచేసేవాడు.

ఆ రోజుల్లో సుందరం ముఖ్యమైన సిద్ధాంతం:—పెళ్లాం దగ్గర పడుకోకూడదని – భార్యాభర్తలు ఊర్కే మిత్రులులా మసలాలని, కార్లయిలు మహాపండితుడు అన్నట్లు భార్యాభర్తల మధ్య ప్లెటోనిక్ ప్రేమ ఉండాలని—ఇది సూక్ష్మంలో సుందరం మహాశయుని సిద్ధాంత సారాంశం.

మా కందరికీ ఈ సిద్ధాంతంలో నమ్మకం ఏమీలేకపోయినా, సుందరం దీన్ని ఏవిధంగా ఆచరణలో పెడతాడో చూడాలని మహావుండేది.

మిత్రులం మేమందరం ఒకేబసలో వుండేవాళ్లం, తన స్వతంత్ర సిద్ధాంతాలకు గట్టిపునాది ఏర్పడ్డదని దృఢనమ్మకం కలిగినతరవాత, సుందరం తన సతీమణిని మెడ్రాసుకు తీసుకొచ్చి మా బసలోనే వుంచాడు. సుందరం మొదటినుంచి మగ, ఆడఅనే భేదాన్ని అంగీకరించలేదు. కాబట్టి, వేరేబస ఏర్పాటు చేసుకోకుండా, మా అందరితోపాటు ఆవిణ్ణికూడా ఒక మిత్రుడికింద భావించి మా బసలోనే వుంచాడు. మేము షికారుకివెళ్లినా, సినిమాలకు వెళ్ళినా, మా అందరితో కలిసివచ్చేది. మేము ఆమెతో ఏసంగతిని గురించి మాట్లాడటానికి సుందరంగాని ఆవిడగాని ఏ విధమైన అభ్యంతరం పెట్టలేదు.

మా మిత్రులలో 'పాత ఉసిరికాయ పచ్చడి' అనే నామాంతరం వున్న జిడ్డుకృష్ణ. పూతపట్టటం ఆరంభిస్తే ఒక పట్టాన తెమిలేవాడు కాడు—అందుచేత వెలకణ్ణా (ఆముదం) కృష్ణఅనే పేరుపెట్టాం.

సుందరం ఏదిచెబితే దానికల్లా సేభాష్అంటూ హమేషా కూడాకూడా తిరుగుతూ, రిఫార్మర్ సుందరం ప్రత్యేక ఆదరాభిమానాల్ని సంపాయించాడు. మా అందరికంటె సుందరానికి అతని భార్యాకు జిడ్డుకృష్ణమీద యెక్కువ వాత్సల్యం ఏర్పడ్డది. ఈ విధంగా కొంతకాలం గడచింది.

పైకి అందరు అన్నివిధాలా ఒకేమాదిరిగా ఉన్నారు. అయితే సుందరంభార్య గర్భవతి అయిన సూచనలు కనిపించాయి. సుందరం ఏమిచెయ్యలేదని మాకందరకు తెలుసును; అతని అంతరాత్మకి తెలుసును అయితే ఆకాస్తపని ఎవరివల్ల జరిగిందా అనేటటువంటిది పెద్ద సమస్య ఐంది. ముద్రముద్ర పడంగా వుండగా ముగ్గురు బిడ్డల తల్లి ఐందనే సామెతలా వుంది. సుందరం ఎవర్నీ ఏమీ అనలేదు.

కొన్నాళ్ళపాటు తీవ్రంగా ఆలోచించాడు.

ఆ ఒక్క విపరీత ఘట్టం సుందరం జీవితాన్ని, జీవితాదర్శాలని పూర్తిగా మార్చేసింది. ఇప్పుడు సుందరం ఏమిమాట్లాడినా, ఏది రాసినా ఆ అద్భుత సంఘటనను అనుసరించే వుంటుంది. ఆషాడభూతి- జిడ్డుకృష్ణ ఈ ఘట్టానికి కారకుడని తరవాత కొన్నాళ్ళకు వదంతులు బయలుదేరాయి.

సుందరం తనరచనలచేత ఆంధ్ర సారస్వతంలో అగ్రస్థానాన్ని ఆక్రమించుకొన్నాడు.

ఐతే ఆసుప్రసిద్ధ పురుషుడెవరో మీరు చెప్పగలరా ?

# నటుడుకావాలని లేచిపోయిన బాజానీ

బాజానీ యువకుడు, రూపసి. అతని నవీన నాగరికతా వ్యామోహము సినీమాలు చూచుటవల్ల కలిగిన మనః పరిణామము ఈకథలో చక్కగా చిత్రింప బడ్డాయి.

రచయిత:

పురాణం కుమారరాఘవశాస్త్రి, బి.యే.

తలమీద వెంట్రుకకూడా రేగనీయడు బాజానీ. ఎప్పుడు చూచినా క్రాపింగు అప్పటి కప్పుడు దువ్వి పెట్టినట్టు కనిపిస్తుంది. పరాయి, చొక్కా కూడా ప్రతిక్షణమూ చెక్కుచెదరకుండా ఉంటవి; ఏదైనా కాస్త మరకపడ్డదంటే చాలు వెంటనే విడిచేసి మరొకటి తొడుక్కోవలసిందే. మనిషికూడా ఎర్రగా, అందంగా, ఆడపిల్లలుగల మహమ్మదీయ గృహస్థులకు ఆశలు గొలుపుతూ ఉంటాడు.

అతని పుస్తకాలుకూడా నిత్యనూతనాలు; అప్పుడే బజారునుంచి కొనుక్కొచ్చాడా అనుకుంటాం. ఎప్పుడైనా వాటిని చదువుకోటానికంటూ తెరచిన పాపాన పోతేనా మరి !

చిన్నప్పుడే తండ్రి చనిపోయిన కారణంచేత తల్లి మహా అబ్బరంగా పెంచింది. పినతండ్రికూడా— ఏమన్నా అంటే తల్లిమనస్సుకు కష్టమనిపిస్తుందేమోనని—అతడు చదివినా, చదవకపోయినా, ఎలా తిరిగినా, ఏమీ దండించేవాడు కాదు అదికాక, పెద్ద చదువు చదువుకుని ఉద్యోగం చేయవలసిన యావశ్యకత లేదాయెను. మోటార్ల వ్యాపారం ఉంది; యేటా కావలసినంత లాభం కనిపిస్తోంది.

మునిసిపల్ హైస్కూల్లో చదువుతున్నాడు బాజానీ. పినతండ్రి మునిసిపల్ కౌన్సిలులో మెంబరు కావటంచేత బాజానీ ప్రతియేటా పాసౌతూ వచ్చాడు. కాని స్కూలుఫైనలుక్లాసులో రెండుసార్లు దండయాత్రలు తప్పని సరిగాచేయవలసి వచ్చింది. మూడో సంవత్సరం చదువుతున్నాడు. ఆయేడు ట్యూషన్ చెప్పటానికి నేను కుదిరాను, అప్పటి కతనికి పందొమ్మిది సంవత్సరాల యీడు ఉంటుంది. మనస్సు నూతనాకర్షణలకేసి పరుగెత్తే వయస్సు. బలవంతాన కూచోబెట్టి, కొట్టియైనా చదివించదగినకాలం దాటిపోయింది.

మొదటిరోజుల్లో నేను నాడ్యూటీప్రకారం సరిగ్గా ఉదయం ఎనిమిదింటికల్లా వెళ్ళేవాణ్ణి. కాని అప్పటికింకా బాజానే నిద్రలేచేవాడు కాదు. నేనువెళ్ళి ఆఫీసుగదిలో కూచుంటే, ఒక నౌకరు మేడమీదికిపోయి ఆయన్ను లేపి నారాక ఎరిగించినమీదట, తిన్నగా లేచి, ముఖం కడుక్కొని, స్నానంచేసి, దుస్తులుధరించి, క్రాపుదువ్వి, కాఫీ త్రాగి, వచ్చేసరికి తొమ్మిదిగంటలయ్యేది. అతనికోసం కూచుని కూచుని విసుగెత్తిపోయేది నాకు. కొన్నాళ్లు చూచాను ఈతరహా తరువాత నేనే తొమ్మిదింటికి రానటం ప్రారంభించా.

మొదటిరోజుల్లో—బాజానీసరుకు నాకు బాగా తెలియనప్పుడొకనాడు ఇంగ్లీషు పాఠంతీసి చక్కగా బోధించుదామని ప్రయత్నంచేశా. నేను చెబుతున్నది గ్రహిస్తున్నాడో లేదోనని మధ్యమధ్య ప్రశ్నలువేస్తే బెల్లంకొట్టిన రాయిలాగు మాటాడకుండా ఉండిపోయాడు. చెప్పిన విషయమే మళ్ళీమళ్ళీ చెప్పవలసి వచ్చింది. అలాగ ఒక అరగంటసేపు గొంతు చించుకున్నమీ

దట 'అరణ్యే మయా రుదితం' అనిపించింది. బాజానీమాత్రం—గుడ్లు నాకూ—శరీరాన్ని కుర్చీకీ—మనస్సును ఎక్కడో — వొప్పజెప్పి, నిస్సంగియై, మానివలె కూచున్నాడు.

మరొకనాడు లెక్క కాబో లొకటి బోధిస్తోన్నప్పుడు మోటారుకారు బైట ఆగినచప్పుడు వినిపించింది. వెంటనే బాజానీ కిటికీగుండా అటుకేసి ఆప్యాయంగా చూచి, ఆ వచ్చింది ఇంజనీరుగారి 'కార'నీ, రెండు నెలలకింద వాళ్ళ కంపెనీద్వారానే కొన్నారనీ, కొత్త 'మోడల్' అనీ, అది పాతోంటే కాసంతైనా చప్పుడవదనీ,—ఇంకా మోటారుకార్లనుగురించి నాకు తెలియవని తా ననుకున్న విషయా లెన్నో వివరించాడు.

మోటారంటే మాత్రం కుర్రవాడికి చాల సరదా. దాన్ని చూచినప్పు డతనిలోనించి ఒక రకమైన కవిత్వం బయలుదేరుతుంది. విశ్వసౌందర్యమంతా అతనికి మోటారులో కనిపిస్తుంది. తాను స్వయంగా మోటారు నడుపుతూ బ్రహ్మానంద మనుభవించేవాడు. స్వంతకార్లు రెండుమూడు ఉండటంచేత పినతండ్రికి తెలియకుండా, రోజుకు ఒకసారైనా, 'కారె'క్కి నాలుగుబజార్లూ తిరిగి వస్తూండేవాడు.

ఒకనాడు ఉదయం తొమ్మిది గంటలకు చదువు చెప్పటానికినేను వెళితే, బాజానీ అంతకుముందే మోటారులో ఎక్కడికో వెళ్ళాడని నౌకరు చెప్పాడు. ఆ పాళాన నేను తిరిగి వెళ్ళిపోయినట్టయితే బాగుండేదేమో; త్వరలోనే తిరిగి వస్తాడుగదా అని ఆఫీసులో కూచుని ఉండగా పినతండ్రి వచ్చాడు. బాజానీ ఇంట్లో లేకపోవటం, నేనతనికోసం కాచుకుని ఉండటం, తెలుసుకుని రోజూ ఇలాగే చదువుకోటం తలాయిస్తున్నాడని ఊహించి, చాలకోపం తెచ్చుకున్నాడు. కొంతసేపటికి బైట కారుదిగి బాజానీ లోపలకురాగానే బాగా చీవాట్లు పెట్టాడు. అతనికి కన్నీళ్ళపర్యంతం అయింది. ఆరోజు ట్యూషన్ లేదు.

మర్నాడు ఉదయం నేను మామూలుగా వెళ్ళినప్పుడు బాజానీ చెప్పాడు: గడచినరోజున తన్నన్నిమాటలన్నందుకు పినతండ్రిని వాళ్ళమ్మ కూకలేసిందిట. చిన్నవాడు తెలియక ఏదైనా తప్పుచేస్తే అంత కోప్పడతారా అందిట. ఆమె మాటలకు పినతండ్రి పశ్చాత్తాపపడి జరిగినదానికి పరిహారంగా అయిదు రూపాయలనోటు తనజేబుఖర్చు కిచ్చాట్ట గతరాత్రి తాను స్వయంగా సినీమాకు తీసుకువెళ్ళాట్ట కూడాను.

హిందీ, ఉరుదు సినీమాలు వస్తే బాజానీ తప్పకుండా వెళ్ళవలసిందే; వెళ్ళొచ్చి కథానాయకుడు ఏయే విలాసవంతములైన దుస్తులు ధరించినదీ— ఎంతెంత యెత్తు గోడలమీదనుంచి దుమికినదీ—మోటారు ఎంత వేగముగా నడిపినదీ—ఈ మొదలైన విషయాలన్నీ నాకు చక్కగా బోధపరచేవాడు.

---

అతనికి 'నెసిల్సు' కంపెనీవారీ చాకొలెటు పేకెట్లలో ఉండే హాలీవుడ్ నటీనటకుల బొమ్మల్ని సేకరించటం సరదా.

అద్దంలో చూచుకున్నప్పుడు తనలో ఒక కొత్త సౌందర్యరేఖ ఉపజాతమైనట్టుగా అనుమానం కలిగిందంటే వెంటనే వెళ్ళి ఫోటో తీయించుకువచ్చేవాడు. చేతి 'కెమెరా' వొకటి కొన్నాడు కూడాను. సరదాపుట్టినప్పుడల్లా అది పుచ్చుకుని, నదివొడ్డుకో, పొలాల్లోకో, వెళుతూంటాడు.

ఒక గొప్ప నటుడు కావాలనో —నేర్పరియైన మోటారు- మెకానిక్కు అనిపించుకోవాలనో— సినీమాలో 'కెమేరామాన్' గా తయారవాలనో— అతని మహత్తరమైన ఆశయమై ఉంటుందని నాకుతోచేది. అతని కభిరుచిలేని యీ ఆంగ్లవిద్య మాన్పించి, అతనికిష్టమైన ఆ తోవల్లోకి తిప్పితే బాగుంటుందని పినతండ్రి కెవరైనా బోధించగలిగితే బాజానీకి మహోపకారం చేసినవాడౌతారు. కాని, ఆ పినతండ్రిగారు, దేశంలో చాలమంది తండ్రులు తమ పిల్లల అభిరుచుల్ని పరిశీలించక, వాళ్ళు కనీసం స్కూలుఫైనల్ వరకైనా తప్పకుండా చదివితేనేగాని ఇహపరాలుండవని నమ్ముతున్నారు. కాబట్టి అలాగని పినతండ్రికి నచ్చచెప్పటం కష్టం. ఎవరమైనా అలా ప్రసంగం ఎత్తితే మనం తప్పకుండా ఆ కుర్రవాణ్ణి పాడుచేయటానికి తలపెట్టినట్టు భావించవచ్చు కూడా.

కష్టమో, నిష్ఠురమో, బాజానీ పరీక్షలదాకా ఈడ్చాడు. పరీక్షల్లో తోచినట్టు రాసివచ్చాడు.

పరీక్షాఫలితాలు తెలిసినై; బాజానీ కృతార్థుడు కాలేదు. ఔతాడని అనుకున్నాం కనుకనా?

పరీక్షాఫలితాలు తెలిసిననాటినించీ బాజానీ ఎక్కడా కనిపించలేదు. ఊళ్ళోకూడా లేనట్టు తెలిసింది. ఒకనాడు వాళ్ళ ఆఫీసులో గుమాస్తా కనబడితే అడిగాను.

"వాడండీ! వాడు చదువుకుని బాగుపడతాట్టండీ! పారిపోయాడు. వెళ్ళిపోయి పూనానుంచి ఉత్తరం రాశాడు మొన్ననే పినతండ్రికి. అక్కడేదో 'ప్రభాత్ కాలేజి' అంటూ ఒకటి ఉందిటగా! సినీమాల్లోకి పనికొచ్చేలాగ తయారుచేస్తారట అక్కడ. అందులో చేరాట్ట. డబ్బు పంపించమంటూ ఉత్తరం రాశాడు. మొన్ననే వొక వందరూపాయలు టెలిగ్రాం మనియార్డరు చేశాడు పినతండ్రి" అని చెప్పాడు గుమాస్తా.

# వ్యంగ్యచిత్రాలత్యవసరం:

రచయిత:
మల్లాల వెంకటశివరామకృష్ణ.

వ్యంగ్యం అంటే సాధారణంగా ఎవటి వ్యక్తికి నొప్పి కలిగించకుండా హాస్యంగా వానిని గురించి విమర్శనాపూర్వకంగా చెప్పడం. ఈవిధంగా ఒక వ్యక్తినేగాదు ఒక సంస్థనిగాని సంఘంలోవున్న లోటుపాట్లనిగాని ఒక కవియొక్క రచనల్నిగాని ఏవిషయాన్నైనా ఉటంకించవచ్చు. అంతేగాక ఈవ్యంగ్య రచన వ్యంగ్యచిత్రాలగాను వ్యంగ్య వ్యాసాలగాను వికటకవిత్వం, గేయాలు, చలన చిత్రాలు మొదలై అనేకవిధాలుగా కూడా వుంటుంది.

పూర్వకాలంలో ఈ వ్యంగ్యాన్నంతటినీ గుత్తకుచ్చుకున్నవాడు తెనాలిరామకృష్ణకవి. ఇతడు వ్యంగ్యధోరణిలో శ్రీకృష్ణదేవరాయలంతటి మహారాజాధిరాజు పరిపాలనలోగల లోటుపాట్లు సరిదిద్దగలిగేవాడుట. వ్యంగ్యచిత్రాల్నికూడా రచించినట్లు శ్రీ అనంతపంతుల రామలింగస్వామిగారి శుక్లపక్షంలోని భావతురంగము అనే శీర్షికగల పద్యభాగాన్నిబట్టి గ్రహించగలం.

వ్యంగ్య రచనలవల్ల కేవలం విమర్శేగాక నేటి సాంఘిక వ్యవస్థల్నిగూడా ప్రజలకి సులువుగాను, కులాసాగానూ బోధించవచ్చు. ఎంతటి తీవ్ర మనోభావాలైనా పారద్రోలి చిరునవ్వు నవ్వింపజేసే ప్రభావం ఈ రచనల్లోవుంది. మనస్సు చీకాకుగాను ఆందోళనగాను ఉన్నప్పుడూ, విచారంగా ఉన్నప్పుడూ మంచి ఉల్లాసాన్ని చేకూర్చగలదీ వ్యంగ్యరచనాస్త్రం.

ప్రస్తుత వ్యంగ్యవ్యాస రచయితల్లో శ్రీ భమిడిపాటి కామేశ్వరరావుగారూ, నందివాడ చిదంబరంగారూ సిద్ధహస్తులు, కామేశ్వరరావుగారు లోగడ భారతిలో ప్రకటించిన 'ఆంధ్రాయూనివర్సిటీ పట్టుదలలు, కాఫీదేవాలయం, అద్దెకొంపలు, పల్లెటూరి స్కూలు తణిఖీ తంతు, ఇంగ్లీషు తమ్ముడు తమ్ముడిపెళ్ళికి తర్లీ వెళ్ళడం అనే వ్యాసాలూ, బాగుబాగు, కచటతపలు' అనే ఏకాంకికలూ ఎంతేనా హృదయంగమంగా వుంటాయి. నందివాడవారి వర్తకమందం, దేవునిపై విశ్వాసరాహిత్య తీర్మానం మొదలైనవికూడా ఈధోరణిలోనే వుంటాయి. ఇందు లలితమైన హాస్యం మంచి విమర్శనా పాటవం ఒప్పారుతోంటుంది. ఇంకా, తాతా కృష్ణమూర్తి ఏలేశ్వరపు కృష్ణమూర్తి మల్లాది అవధానిగార్లు ఈ రచయితల్లో చెప్పదగ్గవారు.

వ్యంగ్యచిత్రాలద్వారా తమ భావాల్ని ప్రకటించి సంఘాన్ని మరమ్మతు చేసేవారిలో శ్రీ తలిశెట్టి రామారావుగారు అగ్రగణ్యులు, ఆంగ్లానువాదాలనుగూడా తలదన్నే వీరిస్వతంత్ర-చిత్రాల్లోగల ప్రతిభ నిరుపమానం. 'మనుష్యులకు తోకలుంటే, హోటలు మెతుకులు; ఓట్లు, భీమాఏజంటు, ఉత్సాహి. ముద్దలకాడు' మొదలైన చిత్రాల్లోగల హాస్యం విమర్శనా పాటవం వర్ణనాతీతం. ఇట్టి చిత్రకారులనేకులాంధ్రదేశంలో బయలుదేరుతోన్న సంగతి చాలా ముదావహం.

వ్యంగ్యగేయ రచనకూడా ఇప్పుడిప్పుడే తలచూపుతోందిగాని దీనిలో ఇంకా అభివృద్ధి కాలేదు.

చలన చిత్రాల్లోకూడా పాశ్చాత్యులీ వ్యంగ్య రచనల్ని మొదలెట్టి అగ్రస్తానం సంపాదించింది. వాల్టుడిస్నీ ఈ కళ కాద్యబ్రహ్మ. మనఆంధ్రుల్లోగాని భారతీయుల్లోగాని ఈఫక్కీలో చిత్రాలు నిర్మించి దిగ్విజయంబడసినవాళ్లు లేరనే చెప్పాలి. ఈ రకపు చిత్రాలుకూడా నేటికానికి చాలా అవసరం: కనుక మన ప్రొడ్యూసర్లీరకం చిత్రాలుకూడా తయారు చేయడానికి మొదలెట్టి ప్రజల మన్ననకు పాత్రులౌతారని ఆశింపవచ్చునా?

# లూజుగావుంటేనే లాభం

లూజుగా ఉండటములోని హాయిని మనుష్యులింకా గుర్తించినట్టు లేదు.

లూజుగాఉంటే లోటులు తీరిపోతాయి. బెట్టుసరిగలవాడు పంక్తిభోజనానికి అనర్హుడు.

లూజుగాఉంటేనే పైకివస్తాడు. లూజుగాఉన్న సరుకే తెరకెక్కింది.

మూతిబిగించుకుంటే మోక్షము లేదు. శరీరావయవాలు లూజుగా ఉండాలి. గుణము లూజుగా ఉండాలి. సంభాషణ లూజుగా ఉండాలి.

చూడండి! ఈ రోజుల్లో సారస్వత మెంతలూజో! రాజకీయవాదా లెంత లూజో! రాజకీయవేత్తల ఉపన్యాసాలెంత లూజో! అసలు భూగోళమే లూజుగా వ్రేలాడుతోంది. అందులోని జీవరాసులన్నీ లూజుగా తిరుగుతూ ఉంటాయి.

... ... ...

అవయవాలు లూజుగా ఉంటేనే, పట్టుకుని స్క్రూత్రిప్పి అక్కడపడేసి పో! ఎట్లాపోతావో అనవచ్చును. సందులు తిరిగే అలవాటున్నవాని రెండుకాళ్లుతీసి బీరువాలోపెట్టి తాళమువేస్తే అతడేమి చేయగలడు. జితేంద్రియత్వమంటే ఇదీ అర్థము.

శరీరములో అన్నిటికి స్క్రూలు పెట్టాలి. పడిశముపట్టిందనుకోండి. ముక్కుఊడదీసి పంపుక్రింద జాడించి మరల తగిలించుకోవచ్చును. తలదిమ్ముగాఉంటే, దానినితీసి బంగీకట్టి పరీక్షకోసము మద్రాసు గురుస్వామి మొదలియారుకు పంపించవచ్చును. ఊళ్లోపుగా ఏసినిమాకో వెళ్ళవలసిఉంటే పెండ్లాముతల పెట్టుకొనిపోయివచ్చేది.

అయితే, ఒక్క చిక్కుఉంది లూజుగాఉంటే మరియొకడు వచ్చి నిద్రపోయేటప్పుడొక అవయవము ఎత్తుకుపోతాడేమో! అందుకని ముఖాలు, అవయవాలు అన్ని ఒకేమాదిరిగా ఉండాలి. పశులు జంతువుల మాదిరిగాఉంటే వచ్చే నష్టములేదు. దొంగతనాలు జరుగవు. కావాలంటే మోటారు మాదిరి మోడల్ మార్చుకోవచ్చును. 1940 వ మోడలువేరు 1941 వ మోడలువేరు ఒకదానిస్పేరు పార్టు ఇంకొదానికి సరిపోదు, యుద్ధములో చచ్చిపోయేవారి అవయవాలుతెచ్చి స్పేరుపార్ట్సు దుకాణం పెట్టుకొని అమ్ముకోవచ్చును. మోడల్నుబట్టి ధరలు జరగాలి. జన్మతిథులతో పని లేదు.

... ... ...

ఇంకా చదవండి అప్పుడు అని అనకండి అప్పుడే! తలపోయిన తర్వాత మొండెములు మాట్లాడినాయి నోటితో! తలపోయి ఇంకో శరీరముతో కలసిన కథలున్నాయి! వినాయకునకు ఏనుగతల తగిలించిన కథ మీకు తెలియునా? గాంధారివంటి విజ్ఞాని కుండలలో 'లేబొరేటరీ లేకుండా' నూరుమంది పిల్లవాండ్లను తయారుచేసింది. అమెరికాలో 'టెస్టుట్యూబు' బేబీలను తయారుచేయుచున్నారుగదా!

మొన్న మాస్కోలో ఒక విజ్ఞాని ఒక కుక్కతల గ్లాసు పెట్టెలో రెండునాళ్ళుంచి, తరువాత ఆ తలను మరల కుక్క మొండెమునకు కలిపి కట్టాడు. కుక్కతోక లొటలొట లాడించుకుంటూ యజమానివద్దకు పరిగెత్తింది. అతడే

---

## ప్రేమ

పుడమియందూ
పేరుగనుటకు
ప్రేమకావలె!
ప్రేమకావలె!

మతములన్నీ
హితముగనుటకు
ప్రేమకావలె!
ప్రేమకావలె!

పణతియందూ
ప్రణయసుఖముకు
ప్రేమకావలె!
ప్రేమకావలె!

పరమునందూ
పదము నిడుటకు
ప్రేమకావలె!
ప్రేమకావలె!

—పి. వి. హనుమంతరావు.

లాపచిన్స్కీ అనేవాడు. ఇప్పుడు యుద్ధములో పనిచేస్తున్నాడు. ఎవరికైనా కాలుపోతే ఇంకోకాలు తగిలిస్తున్నాడట! అందుకని స్పేరుపార్ట్సు పారేయవద్దని ప్రకటన కూడా చేశాడు.

వొరొనొఫ్ అనే డాక్టరు శరీరము లోపలిభాగాలను తీసి యింకొకటి పెట్టి శరీరాన్ని మరమ్మతు చేయుచున్నాడు. ఈచికిత్స మన దేశములోకూడ కొంతమందికి జరిగింది.

మాలినో వస్కీ అనే రష్యా దేశస్థుడు ఇంకోపద్ధతి కనిపెట్టినాడు. చెట్లకు అంటు త్రొక్కినట్లు జీవరాసులకుకూడ చేయవచ్చునన్నాడు.

అమెరికాలో శ్వీండ్ అనే డాక్టరు ప్రయత్నముచేసి పిల్లికి ఎలుకకు అంటుత్రొక్కి, అవిరెండు కలిసిపోయిన తర్వాత 'ఎలుకపిల్లి' అని పేరు పెట్టినాడు.

సృష్టికి ప్రతిసృష్టి చేసేటప్పుడు విశ్వామిత్రుడు యీ అంటుత్రొక్కే పద్ధతినే అవలంభించినట్లు తెలుస్తుంది. పిల్లి కుందేలు కలసి చెవులపిల్లి అని, పంది ఎలుక కలిసి పందికొక్కు అని, యీవిధమైన కలితీసరుకును విశ్వామిత్రుడే సృష్టించాడట!

స్పేర్లు లూజుగా ఉండాలి. సరుకు కలితీకావాలి. అప్పుడు ప్రపంచములో శాంతి కుదరాలి.

—శ్రీ గిరిరాజు రామారావు.

# ఆశ!

ఆశచేతనె భూచక్ర మడుగుబెట్టు
జీవితంబుకు ఆశయే జీవగఱ్ఱ!
అనుదినము ఆశ కొట్టుకులాడుచుండు
'ముందు క్షణమున ఆనంద ముండు'ననుచు

'గ్రుంకు సూర్యుడు ఒక్కొక్క సంకటమును
వెంటగొనిపోవు; గండము నెడలె!' ననుచు
'ఉదయభానుడు క్రొత్త సంపదలదెచ్చు'
ననుచు పేరాస నామది నావహించు,

చిమ్మ చీకటులెల్లడ గ్రమ్ముకొనియె;
మానసమునందు నిర్వ్యాజమైన బాధ
'ఉస్సురుస్స'ని కాల్చుచునుండు; చేత
సములువై నృత్యమున గ్రుంగునట్లుజేయు;
చెప్పజాలను... ఆ బాధ చిత్రమదియె!

ఘోర తిమిరంబులోబడి దారితప్పి
తిరుగు పాంథుకు దూరాన దీపమట్లు,
కఠిన నరకంబులోనీదు కలయె నాకు
ఆశ కల్పించి యించుక అనునయించె.

మనసునిండక, 'నీవె ప్రేమైకమూర్తి'
వనుచు నమ్మితి; గాని, శాశ్వత వియోగ
దుఃఖమున వేగిపోవ నిస్తులయ భాగ్య
దశ లభించ'ని యెన్నడు దలపనైతి!

నీ విలక్ష్యత్వ సృష్టిలో నేనొకడనె
సర్వ సామాన్య బహుళ విషయములందు,
ఒక విచిత్రపువ్యక్తిగా నూడిపడితి;
అల్పమతినౌట కష్టము లావహిల్లె.

హేయమిది! యింత కంటక ప్రాయమైన
జీవితపథము ఘోరత మావృతంబు;
ముక్తినొసగదు మృత్యువు; మోసగించి
విపదవానల కుక్షిలో విడచిపెట్టు!

—బూర్గుల రంగనాథరావు.

# గురుదేవుడు

రచయిత:
కొత్తపల్లి శ్రీరామమూర్తి, యల్.యమ్.ఇ.

లక్ష్మీ సరస్వతులను ఒకచోట నృత్యము చేయింపగలిగిన తేజోమూర్తి రవీంద్రకవిచంద్రుడు.

కవిగా, గాయకునిగా అఖండ విఖ్యాతిగాంచిన గురుదేవుని భౌతికకాయం భరతభూమిని వీడిచిపోయింది.

కలకత్తాలో పూర్వార్జితమైన స్వగృహంలో శ్రావణ పూర్ణిమా గురువారంనాడు మధ్యాహ్నం 12 గంటల పదమూడునిముషాలకు గురుదేవుడు పరమపదించాడు.

అతని భౌతికదేహం మనలను వీడిపోయినా అతడు మనహృదయపీఠాన్ని అలంకరించేవున్నాడు.

రవీంద్రుడు చిరంజీవి.

రవీంద్రుడు కలకత్తాలో జరాశన్కో అనేభవనంలో 1861 మే 6-వ తేదీని జన్మించాడు, అతని తండ్రిపేరు మహర్షి దేవేంద్రనాథ్ టాగూరు. దేవేంద్రనాథ్ కేవలం దేవేంద్రుడే.

టాగూరు వంశం అసలు పేరు 'ఠాకూర్', అంటే ప్రభువు అని అర్థము.

రవీంద్రుని తల్లిపేరు శారదాదేవి. బాల్యంలోనే అతనికి దూరమైంది ఆమె. మాతృమూర్తి దూరమాటవల్ల విశ్వమంతా శూన్యంగా తోచిన దతనికి. ఆమెకు పధ్నాలుగో కానుపు అతడు.

ప్రేమింపదగ్గ వస్తువు దూరమగుటవల్ల అతని ప్రేమ ప్రకృతిమీద లగ్నమైంది. అతడు బాల్యంలో ఏకాకి. తండ్రి తరచు యాత్రలు చేస్తూవుండేవాడు. కాగా టాగూరుకు తండ్రి దర్శనంకూడా అరుదయ్యేది. దాదులే అతన్ని పెంచి పెద్దవానిని చేశారు.

బాల్యంలో అతని సహపాఠి ఒక్క ప్రకృతే. ప్రకృతిలోని రహస్యాలు తెలుసుకోడానికే అతడు నిత్యం ఆతురపడేవాడు.

టాగూరువంశం చాలా పురాతనమైనది. 1690 లో జెసోరు ప్రాంతమునుండి టాగూరు వంశజులు కలకత్తా చేరారు. కలకత్తా చేరిన ఆదిపురుషుని పేరు పంచానన. అతనిని కలకత్తా పౌరులు 'ఠాకూరుమాసై' అని పిలిచేవారు. ఠాకూరు రానురాను టాగూరు. అయింది. టాగూరు వంశజులు నిష్ఠాగరిష్ఠులు. తాత తండ్రి బ్రహ్మసమాజమతస్థులు.



ఇంగ్లాండును దర్శించిన ఇండియనులలో టాగూరుతాత ద్వారకనాథుడు ప్రథముడు.

టాగూరు జనకుడు జనకమహర్షి వంటివాడు. అతని పెద్దన్నగారు ద్విజేంద్రనాథ్‌కూడా కవిగా కీర్తిసంపాదించాడు. చిరకాలం బ్రతికాడు. అతని సోదరులలో మరియొకరు ప్రథమ ఇండియన్. ఐ.సి.యస్. గా ఉత్తీర్ణుడైనాడు. అతని సోదరి స్వర్ణకుమారి నవలలు వ్రాసిన హిందూ స్త్రీలలో ప్రథమురాలు. అతని అగ్రజన్ములలో ఒకడగు జ్యోతీంద్ర నాథుడు రవీంద్రునకు మార్గదర్శకుడైనట్టు అతని ప్రోత్సాహంవల్లనే రవీంద్రుని హృదయంలో ఈ దేశాభిమానం నాటుకొన్నట్టు రవీంద్రుడు చెప్పేవాడు. మొత్తం మీద అది ఒక పండిత కుటుంబం. అసలే రత్నం, దానికి బంగారం పొదిగినట్టు – అసలు రవీంద్రుడు, జన్మతః కవీంద్ర సార్వభౌముడు దానికి తోడు లక్ష్మీకటాక్షమున్న పండితకుటుంబంలో పుట్టుటవల్ల అతని విద్య రాణించింది. అతని కీర్తి అభ్రంకష స్థానాన్ని పొందింది.

ఇంతటి ఘనత వహించిన ఈ కవిచంద్రుడు బాల్యంలో మహనీయులు అందరికివలెనే మొద్దబ్బాయి కాని దరిద్రం ఎరుగడు.

రవీంద్రుని గురువు ఇతనిని చాలా కఠినంగా శిక్షించేవాడు. గంటలతరబడి మండుటెండలో నించోబెట్టి చదివించేవాడుట పాటాలు గురుపెట్టే యమయాతనలు చూస్తే రవీంద్రునకు చదువంటే అసలు అభిరుచే లేకండాపోయిందిట.

యాత్రలలో కాలం గడిపే తండ్రి ఒకసారి ఇంటికి వచ్చినప్పుడు రవీంద్రుని అవస్థ చూచి జాలిపడి స్కూలుకి పంపడం మానిపించి ప్రయివేటుమాస్టరు నొకరిని నియమించాడట.

ఆ బాల్యంలో సంగీతమంటే చెవికోసుకునేవాడు రవీంద్రుడు. అది కనిపెట్టి తండ్రి సంగీతంతోనే చదువుచెప్పి చదువులో రుచి పుట్టించాడు. తనతో యాత్రలకు తీసుకు వెడుతూవుండేవాడు.

ఆ బాల్యంలోనే పాటలు పద్యాలు వ్రాయడం ప్రారంభించాడు రవీంద్రుడు. అవన్నీ అనుకరణలే.

అసలు కవితాధార అతని 18వ ఏట పట్టుపడింది. అప్పట్లో అతడు రచించిన ప్రభాత సంగీతం, సంధ్యాసంగీతం అనే కావ్యాలు రసభరితంగా విరాజిల్లాయి. 18 ఏండ్ల నాటికే లెక్కలేనన్ని గీతాలు రచించాడు.

1877 లో రవీంద్రుడు తన సోదరుడు సత్యేంద్రనాథుతోకూడా ఇంగ్లాండు వెళ్ళాడు. న్యాయవాది వృత్తికి చదవాలని అతని వాంఛ. కొంతకాలం బ్రయిటన్ పబ్లిక్ స్కూలులో చదివి లండన్ విశ్వవిద్యాలయంలో స్థానం సంపాదించాడు.

కాని విద్య పూర్తికాకండానే ఇండియాకు తిరిగి రావలసి వచ్చింది. ఇంగ్లాండుమీద అతనికి ఆదరాభిమానాలు కుదరలేదు.

అతడు ఇంగ్లాండునుండి తిరిగి వచ్చాక అనేక గీతాలు వ్రాసాడు.

1883లో అతనికి ఇరువదిమూడవ ఏట వివాహమైయింది. భార్య పేరు మృణాళినీదేవి.

సంసారం నెత్తిని బడగానే జీవిత నిజస్వరూపం అవగాహన ఐంది. ఏంచేయడమా అన్నది ఒకసమస్య అయింది.

తండ్రి,—మహర్షి—రవీంద్రుని భూములు చూచుకోమని సలహాయిచ్చాడు. మొదట్లో తన కిష్టం లేకపోయినా పితృదేవుని ఆజ్ఞానుసారం పవిత్ర గంగాతీరమందున్న షిల్లాడా గ్రామంలోని తమ ఎస్టేటు చూచుకోడానికి వెళ్ళాడు. సకుటుంబంగా అక్కడ సామాన్య ప్రజలుపడే కష్టసుఖాలు అతనికి బాగా అర్థమయాయి. ఆ సామాన్య ప్రజల జీవిత రహస్యాలమీద వ్యాసాలు, గీతాలు నాటికలు వ్రాయడం ప్రారంభించాడు.

ఆ పల్లెపట్టుజీవనం సుమారు 17 ఏండ్లు గడిపినట్టు తెలుస్తోంది.

ఆ ఆనందమయ దినాలిట్టేతెల్లవారిపోయాయి. మృణాళినీదేవి 1902లో తన భర్తను వీడి పరలోకంచేరింది, ఆమె అతనికి యిద్దరు కుమారులను ఇద్దరు కూతుండ్రను వప్పగించింది. మృణాళినీదేవి మరణం రవీంద్రునకు అపారదుఃఖం

తెచ్చి పెట్టింది.

ఆ దుఃఖంనుండి బయట పడకండానే 1904 లో రెండవ కుమార్తె మరణించింది. 1905 లో దేవేంద్రనాద్ దివంగతుడైనాడు. 1907 లో పెద్దకొడుకు పరలోకనివాసి అయినాడు. ఒక దానిపైని ఒకటిగా కలిగిన దుఃఖ పరంపరలు రవీంద్రుని పీల్చి పిప్పి చేశాయి. అతని ఆరోగ్యం పూర్తిగా చెడింది.

సంసారంలో ఎట్టి ఛిద్రాలు వచ్చినా ప్రజాసేవకు వెనుతీయని దేశసేవా ధురంధరుడు టాగూరు.

1901 లోనే శాంతి నికేతనం స్థాపించాడు వివిధనాగరికతలు సమన్వయం చేయడాని కేర్పడిన ఆ శాంతినికేతనం అచిర కాలంలోనే విశ్వభారతి విశ్వవిద్యాలయమైంది.

1905 లో బెంగాలు విభజన చేయడానికి తలపెట్టింది ప్రభుత్వం. దానిని సర్వవిధముల ప్రతిఘటించి ప్రభుత్వపు దృష్టిని త్రిప్పగలిగాడు రవీంద్రుడు.

ఈసమయముననే అతడు గీతాంజలి రచించాడు. గీతాంజలిని ఆంగ్లానువాదంద్వారా కీట్సుపండితుడు ఆంగ్లప్రజలకు పరిచయం చేసాడు. దానితో రవీంద్రకవిచంద్రుని యశశ్చంద్రికలు దిగంతములకు ప్రాకాయి. దానితో 1913 లో అతనికి నోబిల్ బహుమానంవచ్చింది.

ఆ ధనమునంతను విశ్వభారతికి కానుకగా ఇచ్చివేశాడు.

అప్పటివరకు అతని రచనలను పరీక్షలలో ఇచ్చి తప్పులు దిద్దమని చెబుతూవచ్చిన కలకత్తా విశ్వవిద్యాలయంకూడా లక్ష్మీకటాక్షం రాగానే అతన్ని గౌరవింపసాగింది. అతనికి డాక్టరేటు బిరుదము నిచ్చింది.

ఆ మరుచటి వత్సరమే అతనికి బ్రిటిష్ ప్రభుత్వం. నైట్‌హుడ్ బిరుదమును ప్రసాదించింది.

1915 లో జపాను అమెరికా దేశాలు సంచారం చేసి ఉపన్యాసాలు యిచ్చాడు.

1919 లో జలియన్‌వాలా బాగులో జరిగిన దురంతములను నిరసిస్తూ బ్రిటిష్‌వారు ఇచ్చిన నైట్ బిరుదమును విసర్జించాడు. అంతకుపూర్వమే గాంధీమహాత్మునికి యీ కవిచంద్రునికి పరిచయం కలిగింది.

వారి యిద్దరికు భావాల్లో భేధాలు వున్నా ఆశయం ఒకటగుటచేత స్నేహభావం బలీయమైంది.

1920-30 లో యూరప్ దేశాలు సంచారంచేసి ఉపన్యాసాలు ఇచ్చాడు టాగూరు. అతనికి అన్ని దేశాల్లోను అఖండ స్వాగతం ఇచ్చారు.

1940 ఆగస్టు 8-వ తేదీని ఆక్సుఫర్డు విశ్వవిద్యాలయంవారు డి.లిట్ బిరుదం ప్రసాదించారు. ఆసందర్భంలో శాంతినికేతనంలో ప్రత్యేక స్నాతకోత్సవం జరిగింది. అందులో సర్. యస్. రాధాకృష్ణ, సర్ మారిస్ గ్వయర్ ప్రముఖులు అతిధులు.

చాలారోజులనుంచి రోగగ్రస్తుడైనాడు రవీంద్రుడు.

మంచంపట్టిన స్థితిలోకూడా భారతీయులకు హృదయ శల్యమైన రత్బోన్ కన్య వదరుబోతు లేఖకు సమాధాన మిచ్చాడు.

ఆలేఖలో అతని జాతీయాభిమానం ప్రస్ఫుటంగాగోచరిస్తుంది.

రవీంద్రుడు అసదృశ మేధావి. అతడు బెంగాలీభాషకు చేర్చిన రసపుష్టి నిరుపమానము. అతని మాతృభాషాభిమానము చెప్ప నలవి కానిది. అతడు వ్రాసిన ప్రతిగీతం, ప్రతివ్యాసం, నాటకం, నవల అన్నీ మొదట మాతృభాషలోనే.

ఇతడుకవేకాదు. గాయకునిగా, చిత్రకారునిగా కూడా ఖ్యాతి పొందాడు. అతని మేనల్లుడు అబనీంద్రనాధునిచే ఒక బెంగాలీ చిత్రలేఖా విద్యాలయం స్థాపింపజేసాడు.

ఈ కళాస్వరూపి తన సర్వస్వము విశ్వభారతికి ధారవోసాడు. తుదకు మరణసమయంలోకూడా ఆమెకు తన ఆస్థిలో కొంతభాగం చేరేటట్టుగా వీలు వ్రాసి మరణించాడు—

రవీంద్రుని ఆత్మజ్యోతి మన కందరకు ఆదర్శజ్యోతిఅయి అఖండంగా వెలుగుతోంది—

# పై మెరుగులకు భ్రమసిన రాజహంస

చంద్రరేఖ సౌందర్యం ముగ్ధుణ్ణి చేయలేక పోయింది స్వేచ్ఛగా ప్రపంచంలో తిరగాలనుకున్న వాంఛతో ఆమె ప్రణయమును నిరాకరించాడు. తుదకు ఆమె పై పూత మెరుగులకు భ్రమ పడ్డాడు. ఆమె శీలమనేకవచమును భేదింపలేక హానిగామారి పోయాడు రఘు.

రచయిత్రి:
ఇందిరా దేవి

మాధవరావు సామాన్య సంసారి. ఆస్తుపాస్తులు అఖండంగా లేకపోయినా గౌరవాదరణకు లోపంలేదు. శేషమాంబ మాధవరావుకు అనుకూలవతి అయిన భార్య, ఇంటిలో ఎట్టిలోటున్నా ఆమె గుట్టుగా బ్రతకడంవల్లనే పదిమందిలో పరువుగా బ్రతుకుతున్నాడు మాధవరావు.

ఆపుణ్య దంపతుల ప్రేమ ఫలంగా ఒక కుమారీరత్నం లభించింది. ఆమె పుట్టుకతోనే ఆమె సుభలక్షణాలు వ్యక్తమయాయి. ఆముక్కుతీరు కనుబొమ్మల వాలు రతీదేవి అవతరించిందేమో అనుకున్నారు యిరుగుపొరుగు అమ్మలక్కలు.

మాధవరావు లక్ష్మీదేవి అవతరించింది దరిద్రం తీరిపోతుందని మురిసిపోయాడు.

ఒక సుభదినంనాడు ఆబాలికకు బారిసాల చేసుకొని చంద్రరేఖ అని పేరు పెట్టాడు.

ఆబాల దినదిన ప్రవర్ధమానంగా పెరుగుతోంది. పిల్లలంటే చీదరించుకునే పాషాణహృదయులు కూడా ఆమెను ఒక్కసారి ఎత్తుకుని ముద్దాడనిదే పోయేవారు కాదు.

చంద్రరేఖకు అయిదో ఏడు రాగానే అక్షరాభ్యాసం చేయించాడు మాధవరావు. ఆ చంద్రముఖి చిరునవ్వునవ్వినా చిన్నచిన్న పాటలు పాడినా హృదయానందంగా వుండేవి.

చంద్రరేఖ చదువుకునే బడిలో ఆడ మగా అంతాకలసి చదువుకునేవారు. ఆవూరు అట్టే పెద్దది కాదు కనుక వేరువేరు బళ్లులేవు. బడిపంతుళ్ళకు కూడా చంద్రరేఖ అంటే అపారమైన ఆప్యాయం. ఆబళ్లో చదువుకునే ఎనిమిదిఏండ్ల రఘుకుమారునకు చంద్రరేఖకు నేస్తం కుదిరింది.

రఘుకుమార్ శ్రీమంతు కుమార్ తండ్రి ఆ వూరిలో ఒక పిల్ల జమీందారు. వారిదొక పెద్ద కుటుంబం.

వారిదొక పెద్ద కంతం. వంద కాళ్ళుఎడ్లు వున్నాయి. వారి యిల్లు పెండ్లియిల్లులా నిత్యశృంగారంగా పచ్చతోరణాలతో విరాజిల్లేది. పిల్లాజెల్లా ఒక పాతికమంది వున్నారు. కాని కుమారు డొక్కడే ఆవంశానికి మొగఅంకురం. తక్కిన వారందరు ఆడసంతానమే.

ఆటపాటలలోను, అన్నిటిలోను కుమార్ చంద్రరేఖలు కలసి మెలసి తిరిగేవారు చూపరులకు చిలకాగోరువంకలా కనిపించేవారు.

అల్లా కొంతకాలం గడిచిపోయింది.

చంద్రరేఖకు యుక్తవయస్సు వచ్చింది. మాధవరావు కుమార్తెకు వివాహంచేయాలని తహతహ పడుతున్నాడు. కట్నంకానుకలు ఇచ్చి పెద్ద సంబంధాలు తీసుకువచ్చే స్థితిలోలేదు కాని మంచి సంబంధాలకోసం తెగతిరుగుతున్నాడు సీజన్ టికెట్టు తీసుకొని. ఆ ప్రయాణంలో ఒక స్నేహితుడు కలసికొని మాటలసందర్భంలో ఎందుకండీ యింతదూరం వెదుకు

తున్నారు మన రఘుకుమార్‌నకు యిచ్చి చేయకూడదా అన్నాడు.

మాధవరావు కుమార్ తండ్రి ఒకయీడువాళ్లు ఊరువాళ్లయినా ఒకరు జమీందారులు ఒకరు సామాన్యసంసారి అగుటవల్ల అన్యోన్య సంబంధం కాని జోస్తికాని లేకండా పోయింది.

చంద్రరేఖకు స్త్రీ పురుష వివక్షత తెలిసినప్పటినుంచి కుమారునే వివాహం చేసుకోవలన్న వాంఛ కలిగింది, ఆమొలక దినదినం పెరుగుతూనే వచ్చింది.

రఘుకుమార్ కాకినాడ కాలేజీలో ఇంటరు చదువుతున్నాడు క్రిష్టమస్ శెలవులకు స్వగ్రామం చేరుకున్నాడు. చంద్రరేఖ అరవిచ్చిన మల్లెపువ్వులావుందిఅప్పట్లో. ఆమెకునవనాగరికతా చిహ్నాలేమీ లేవు. ఆభరణాలు కూడా అంతగా లేవు. ఆఖరకు ముక్కు పుల్ల కూడా పెట్టుకునే స్థితిలోలేదు.

రఘుబాల్య పరిచయం చేత చంద్రరేఖను చూడటానికి వచ్చాడు. వారిద్దరుకలసి రఘు తాతగారి తోటల్లోకి షికార్లు పోయారు యితర పిల్లలతో కలసి.

రఘు తాతగారు వేసిన తోట ఒక కొండపక్కను వుంది. మామిడిచెట్లు, కొబ్బరిచెట్లు, బత్తాయిచెట్లు అనేకం వున్నా ఒకమాటు నుయ్యి కూడా వుంది. దానిలో ఏతాం కూడా వుంది. ఆతోట సంధ్యా సమయంలో చాలా మనోహరంగా వుండేది. ఆ తోటలో విహరించడానికి వెళ్లారారోజున.

చంద్రరేఖ కళ్ళు తళతళలాడుతున్నాయి. నిండుజవ్వని. రఘు పదహారేళ్ల ఎలప్రాయంవాడు. వారిద్దరికి అన్యోన్య ఆకర్షణ కలగడం సహజం.

ఆరోజున పౌర్ణిమ పుచ్చపువ్వులా. వెన్నెల కాస్తోంది పొద్దు కూకగానే. ఆ వెన్నెట్లో కాసేపు ఆ కొండలమీద ఆడుకుని పోదామన్నాడు రఘు ఆ తోటలో నున్న సంపెంగ పువ్వునుకోసి అతడే ఆమెతలలో తురిమాడు. చంద్రరేఖకు ఒళ్లుగగుర్ పొడిచింది.

ఆ జంట ఆ పర్వతశిఖరం మీదకు పాకారు. ఆవెన్నెట్లో పార్వతీ పరమేశ్వరుల్లాకును పిస్తున్నారూపాలాల్లోవున్న గొడ్లకాపర్లకు. ఒక పాషాణంమీద కూచున్నారు. పిచ్చాపాటీ మాట్లాడుకుంటూ 'చంద్రా! నీపెళ్ళిఎప్పుడే?' అనిఅడిగాడు



మగవారి పశుత్వానికి బలియై మానహానికి వగచుచున్న — లక్ష్మి:
— వాహినీవారి 'దేవత'లో

రఘు ఆ సమయంలో ఆమె ఆవేదనా ఆరాటం వర్ణనాతీతం. హృదయ భారంచేత ఏమి చెప్పడానికి నోరురాలేదు. 'ఛా' అలా సిగ్గుపడతావేమిటి మీ నాన్న సంబంధాలు మీద సంబంధాలు చూస్తున్నాట్టగా ఎక్కడేనా కుదిరిందా 'అన్నాడు' ఆమెను గడ్డంపట్టి తల పైకి ఎత్తుతూ.

తలపైకి ఎత్తేసరికి చంద్రకిరణాలు సరాసరి ఆమె కళ్ళలో ప్రతిభింబించాయి. అప్పటి ఆ ముఖ సౌరభంనే చెప్పలేను. ఆ నల్లటి కురులు ఆ ముఖంమీద చిందులాడుతూవుంటే ఆ ఎర్రని పెదవులు మృదువైన ఆ కపోలాలు. ఎట్టి వానికైనా మోహం పుట్టింపక మానవు.

తనను తన కౌగిటిలోనికి తీసుకొని అదరిస్తాడనుకుంది చంద్రరేఖ రఘు ఆపని చేయలేదు. అ బేల చూపులుచూసి గాభరాపడ్డాడు. ఆ చూపులవెనుక దాగియున్న భావప్రపంచం అర్థంచేసుకోలేక పోయాడు.

కాని ఆమె ఏమంటుందో తెలుసుకోవాలని తరచితరచి అడిగాడు. ఆమె సహజలావణ్యాం రఘువుని ముగ్ధుణ్ణిచేయ లేకపోయింది. రఘువు తరచి తరచి 'చెప్పవుకదూ? చెప్పవుకదూ?' పోనీలే అని విసుపు సూచించేసరికి ఇక బాగుండదని.

'ఎదురుగా వున్నవాడే పెండ్లికొడు'కంది మందహాసం చేస్తూ ఆమెపలుకులు ములుకుల్లాగా తగిలా యతనికి. తృళ్ళిపడ్డాడు. 'నన్నా?'అన్నాడు ఆశ్చర్యంగా.

'నిన్నే రఘూ! ఏం నేను అందంగాలేనా? నీకు తగనా?' అంది అతిదీనంగా'.

'పిచ్చిపిల్లా! అదికాదు నీవు అందంగా లేననికాదు నిన్ను యింతవరకు సోదరిగా ప్రేమిస్తున్నాను'

అసలు నాకు పెండ్లి చేసుకోని యీ సంసారకూపంలో ప్రగ్గాలని లేదు. హాయిగా స్వేచ్ఛగా రాజహంసలా ప్రపంచంఅంతా చుట్టాలని వుంది అన్నాడు ముభావంగా.

ఆమె అందం అతనిని వశపరచుకోలేక పోయింది. రఘువునకు ఉద్రేకం కలిగించలేనందుకు సిగ్గుపడినట్టుగా చంద్రుడు మబ్బుచాటున దాగొన్నాడు.

ఆనాటికి అసమావేశం సమాప్తిచెందింది. తన జీవితలక్ష్యం యిట్లు చితికి పోయినందుకు కృంగి పోయింది చంద్రముఖి.

పద్మమునకు ప్రభాకరునకు పెండ్లిండ్లుచేసే ఈ మానవప్రపంచం ఆ నిష్కలంక ప్రేమహృదయాల మధ్య. కథలు కల్పించారు. లోకం కాకులు అన్నారు. ఇందుకే.

కాని అవ్యక్తులలోవున్న భిన్న ప్రేమతత్వాలు గుడ్డి ప్రపంచానికి ఎట్లా తెలుసుంది.

సీతాకోక చిలుకలవలె తయారయ్యే పట్నవాసపుపడతుల పైపై మెరుగులుచూసి భ్రమపడే రఘు హృదయంలో చంద్రరేఖ స్థానం పొందలేకపోయింది. భార్యనా రఘు పట్నవాసపు పిల్లను కట్టుకుని మేడిపండువంటి సంసారిక జీవితాన్ని గడపడాలనుకుని ఏవేవో ఆకాశ వీధిని సౌధాలు నిర్మించుకొంటున్నాడు. కాని బురదలో సహజ లావణ్యాంతో అలరారుచున్న పద్మమును ఛేధించి అందలి మకరందమును ఆ స్వాదింపదలచుకో లేదు.

అదీకాక వీలైతే స్వేచ్ఛగాఅవివాహితుడుగా వుండాలని వుండేదతనికి. ఈ కారణాలచేత చంద్రలేఖ ప్రణయభిక్ష నిరాకరించాడు.

చంద్రరేఖ ప్రణయ భిక్షయిట్లు త్రోయబడుటవల్ల ఆమె ఉత్సాహం దిగనారింది. ప్రపంచమీదనే విరక్తి కలిగింది. తనను ప్రేమపని వ్యక్తిని తాను ప్రేమించి అతని కై తపమాచరించినా అది బూడిదను పోసిన పన్నీరువంటిదే నిష్పల మగునని నిశ్చయించుకుంది.

ఈ జన్మలో ఆత్మ అతనికి అర్పించింది కనుక ఆత్మహత్య చేసుకొని అతనిలో లీనమవుదామన్నా అతని హృదయంలో ఆమెకు రవ్వంతయు తావులేనప్పుడు ఆమె ఆత్మకు మాత్రం తావు ఎట్లా కలుగుతున్నదామె సంసయం.

పోనీ తనమానము అన్యుల కర్పించకుండా ఈజీవితం బ్రహ్మచారిణిగా గడుపుదామనుకున్నా ఆధార

ములేని లత నలుగురిపాదాల క్రింద పడినలిగిపోయినట్టు తన జీవితం భ్రష్టమనేకాని ఫలితం శూన్యం. తన హృదయమును అతని కర్పించింది. తన తనూలతను ఎవరికైనా పెనవేయుటకు సాహసించింది—

స్త్రీ హృదయంచీల్చి అది పాషాణమో నవనీతమో కనిపెట్టలేని అమాయకుడు రఘు. తళుకు బెలుకులతో పైపై పూతలతో ప్రపంచాని భ్రమపెట్టే నవనాగరికతా వ్యావహారంలో జలక్రీడలు సలిపే పట్నవాసపు పక్షులచే పూర్తిగా ఆకర్షింపబడ్డాడు రఘువు. అతని దృష్టికి అపూర్వ సహజలావణ్యయగు చంద్రరేఖ మట్టిబొమ్మలా కనుపించింది.

సర్వము కదలింపగల కాల మూర్తిచరియలు బహు చోద్యములు.

పట్నవాసపు నవనాగరికస్త్రీల ఆర్భాటములు, షోకులు, చూచిచూచి విరక్తిచెందిన ఒక భాగ్యవంతుడు, యువకుడు, చదువుకున్నవాడు చంద్రరేఖను చూసి బంగారపు బొమ్మయని మురిసిపోయాడు. ఆమెతోటిదే లోకమని తలచాడు. ఆ లక్ష్మీ అవతారాన్ని అర్ధాంగిగా పొందినవాడిదే భాగ్యమనుకున్నాడు. కాగా కట్నం అక్కరలేకండానే ఆమెను పరిణయమాడాడు వివాహమైన కొద్దికాలానికే పెద్ద ఉద్యోగి అయినాడు,

అసలే బంగారపుబొమ్మ దానికి సువాసనకలిగినట్టు అయింది ఆమె సంపద. వస్తువాహనాలతో ఇప్పుడు విద్యుల్లతలా మెరసిపోతోంది. వస్తువాహనాలు సంప్రాప్తించినాయికదా అని భర్తఎడ అనాదరణగాని, ఇంటి వ్యవహారములలో అలసతగాని అహంభావంకాని ఆమెలో గోరంతయు లేవు. ఈ దేహము అతని కర్పించినందుకు అతనిసేవయే పరమావధిగా తలచింది. ఆతనికికూడా ఆమెపై అనురాగం అపరిమితంగా అభివృద్ధి కాజొచ్చింది, ఈ ఉన్నతస్థితికి ఆమె శీలమే కారణమని ఆమె అదృష్టమువల్లనే తనకా గొప్ప ఉద్యోగం లభించిందని అతని నమ్మకం.

ఆమెను ఒక దేవతగానే చూచేవాడు అతను. అత డామెను ఆదరించినకొలది ఆమె అణకువ ఎక్కువయ్యేది. తలలోని నాలుకగా మెలగేది. సభలకు, విందులకు ఆమెను తనతోకూడా తీసుకువెడుతూ వుండేవాడు. అతడు డిస్ట్రిక్టు కలక్టరు హోదాలోకి వచ్చాడు.

ఒకసారి బీదసాదలకు అన్నప్రదానంచేయడానికి సత్రం కట్టడానికి ప్రయత్నిస్తున్నారు. దానికిశంకుస్థాపన ఈ అమృతహస్తిని చేస్తే దేదీప్యమానంగా సాగుతుందని ఆజిల్లా ప్రజలఆశ. కాగా కలెక్టరుగారి సతీమణి శంకుస్థాపన చేస్తారని పత్రికలో వేశారు.

ఆ సందర్భంలో ఒక పెద్దసభ ఏర్పాటయింది. ఆ ఉత్సవానికి చంద్రరేఖ సాధారణంగా అలంకరించుకొని వెళ్ళింది. సభా మంటపంలో, వేదికపైని నిలచి ఏదో ఉపన్యాసం చెబుతోంది. కలెక్టరుగారి సతీమణి ప్రారంభిస్తోవుంటే దానికి లోటా. పెద్దపెద్దలు, జమీందారులు అనేకమంది వేనవేలుప్రజలు వచ్చారా సభకు. ఆ కూర్చున్న ప్రజల తలలనే సాంద్రమేఘముల వెనుక ఆమె మెరపుతీగలా మెరుస్తోంది. ఇరువదిరెండేండ్ల ఎలనాగ స్త్రీ మూర్తి.

---

రఘుకూడా ఆ సభకు వచ్చాడు, దూరాననుండి చూచాడు. ఆ విద్యుల్లతకండ్లకు మిరుమిట్లు గొల్పింది. రఘు విద్యావతులైన స్త్రీల పరిచయంచేతనే విసివి విసివి యింతవరకు పెండ్లి చేసుకోకుండానే వుండిపోయాడు. నిరాడంబరియైన ఆ స్త్రీమూర్తిపై వ్యామోహం కలిగింది. కాగా ఆమె పరిచయానికి ఆతురతపడ్డాడు.

ఆమె తన బాల్యస్నేహితురాలని తెలిసికొన్నాడు.

ఆమెకు తన హృదయావేదనను వ్యక్తంచేస్తూ అనేక ప్రణయలేఖలు వ్రాశాడు ఆమెను ఆదిలో నిరాకరించినందుకు క్షమించమని ప్రాధేయపడుతూ కూడా వ్రాశాడు. ఆమెమనస్సు చలింపలేదు. ఒకజాబుకి సమాధానం లేదు. అతనికి పిచ్చి ఎత్తేటట్టుగా వుంది. అతడు తనవేషంచూసే మోహితుడైనాడని గ్రహించింది! ఆ ప్రేమ క్షణికం కదా! కాని ఒకనికి తనదేహాన్ని అర్పించినవెనుక అతన్ని మోసంచేయడం ఆమెమతం కాదు.

ఉండలేక ఒకనాడు సరాసరి రఘువు ఆమెయింటికి పోయాడు.

ఆమె తన బాల్యమిత్రుడు సోదరపాత్రుడు వచ్చాడు కదాఅని అప్యాయంగా విందుచేసింది. భోజనానంతరం ఆమాటా యీమాటా మాట్లాడుతూ ఎందుకు వచ్చినది ఆమెకు తెలియజేశాడు.

ఆమెకు అతని పరివర్తనకునవ్వు వచ్చింది. ఏమీ చెప్పలేక 'రఘూ! నిన్ను ప్రేమిస్తూనేవున్నాను కాని ఒకనికి అర్ధాంగినై వానిని వంచించడం నా మతముకాదు' అంది ఆ మాట నిశితశరంలా గుండెలోనుంచి దూసుకపోయినట్టుయింది. ఈ తిక్క నీ కెప్పుడు కలిగింది అంది.

ఆమె నోటివెంటవెలువడు ప్రతిశబ్దం అతనికి ఆశనిపాతంలా తగిలింది. గభాలున లేచి చంద్రా! క్షమించు అంటూ గబగబా నడచిపోయాడు గదిలోనుంచి.

ఆ విశాలప్రపంచంలో ఎక్కడ దాగివున్నాడో ఎవరు కనుక్కోలేక పోయారు. చంద్రరేఖకోసం తపం చేస్తున్నాడేమో అమావాస్యనాటి చకోరపక్షిలా.

---

# విజ్ఞానవిషయాలు

బ్రిటిష్ సామ్రాజ్యపు విస్తీర్ణం 13,653,751 చతురపు మైళ్ళు.

... ... ...

ఒక్కొక్క ఇంగ్లీషువాడు సగటున 65 సంవత్సరాలు జీవిస్తాడు.

... ... ...

పనామాకాలవ నిడివి 400 మైళ్లు. లండన్ మందిరాలన్నిలోకి లండన్ టవర్ అతిప్రాచీనమైనది.

... ... ...

బంగాళాదుంపల్లో మిక్కిలి పుష్టికరమైన పదార్థం తోలుకింద బాగా దగ్గరలో వుంటుంది. కాబట్టి బంగాళాదుంపల్ని ఒలిచేటప్పుడు సాధ్యమైనంత తేలికగా ఒలవాలి.

... ... ...

ప్రతి స్త్రీ ఆమె జీవితంలో మొత్తంమీద 10 మాసాలాలు అద్దంచూసుకోవడంతో గడిచిపోతుంది. ఆరేండ్లు మొదలు పదేండ్లవరకు 7 నిముషాలు అద్దంలో తన ప్రతిబింబాన్ని చూచుకుంటూ గడిపేస్తుంది.

పదేళ్ళు మొదలు పదిహేను ఏండ్లు వరకు సగటున రోజుకు ఒక పావుగంట కాలం గడుపుతుంది.

ఇరువది ఏండ్లవరకు అరగంటకాలమైనా అద్దంలో చూచుకొని శృంగారించుకుంటుంది. ఇరువదిఏడు మొదలు నలుభైఏండ్లదాకా సగటున రోజుకు ఒకగంటైనా తన ప్రతిబింబం అద్దంలో చూచుకోక మానదు. ఆ తరువాత అద్దంలో చూచుకొని దిద్దుకోడం తగ్గుతుంది.

... ... ...

పడిశంపట్టి తుమ్ములు జాస్తీగా వస్తూవుంటే కొద్దివేడిగావుండే నీళ్ళలో ఉప్పు కరిగించి ముక్కులో పీల్చడంమంచిది. మరి కొంచెం వేడినీళ్ళల్లో ఉప్పువేసి కరిగించి ఆ నీటితో పుక్కిలి పట్టడం కూడా మంచిది.

# ముద్దుతెరుగని పెదవులు

మగవారి మాయకు విసుపుచెంది బికారిలా తిరుగుచున్న అరుణితో కలిగిన పరిచయం దాని పరిణామం ఏవిధంగా తేలిందో ఈ కథలో మనోజ్ఞంగా చిత్రింపబడ్డది.

రచయిత:

## కావలి శ్రీరామమూర్తి, బి.యే., బి.ల్.

ఆపల్లెలో ఓ పేదరాని పెద్దమ్మ ఇల్లు వుందని విని సాయంకాలము వెళ్ళాను. ఆపెద్దమ్మ వచ్చినవాళ్ళందరూ దొంగలనే వుద్దేశంతో అనుమానంతో, ఏమీ ఇష్టంలేనట్టు మాటాడుతుంది. 'ఏవమ్మాయి, నాకోగది ఇవ్వగలవా?' అన్నాను. మొదట ఖాళీలేదని చెప్పింది, కాని బాగా పరకాయించి ఏమనుకుందో ఓ చిన్న వసారాగది చూపించి అందులో వుండమంది. అది మాఘమాసమేమో, బంతిపువ్వులు విరగపూసి నా కిటికీలో తొంగిచూస్తున్నాయి. 'ఇక్కడ ఇంకా ఎవరైనా వున్నారా?' అని అడిగాను ముసలమ్మని. 'అవును. ఒక నడివయస్సావిడ. ఆమెది ఆగది' అంది వెగటుగా.

ఓకుర్చీ, బల్లా అవతల బంతిచెట్లలో వేయించుకున్నాను మంచి మాటలాడి, కుర్చీలో కూర్చుని పుస్తకం తీసుకుంటుంటే ఎవరో వస్తున్నట్టనిపించింది. తలెత్తాను. ఆమె సన్నంగా పొడుగ్గావుంది ఒక ఎఱ్ఱ మఫ్లరు మెడకు చుట్టుకుంది. ఆమె ముఖం మైనపు బొమ్మ ముఖంలా వుంది. ఎఱ్ఱ కలువ చుట్టూ మూగిన తుమ్మెదల్ని తలపిస్తూ, ఆమె నుదుటిమీద పడి నాట్యం చేస్తున్నాయి ఆమె గిరజాలు. నన్ను చూసీ చూడనట్టు నిర్లక్ష్యంగా తలవంచుకొని ఇంట్లోకి వెళ్ళిపోయింది. ఈ వింత మానిసిని చూసి నాకు నవ్వొచ్చింది. ఈమె ఆ ముసలమ్మ చెప్పిన ఆవిడని గ్రహించాను.

మరునాడు ఆ మనోజ్ఞమైన లోయలో కూర్చుని బొమ్మ వేస్తున్నాను. ఎదురుగా బట్ట చుట్టపెట్టిన తెరచాప కొయ్యలా కొండపై ఏదో కనిపించింది. అది ఆమే. నన్ను చూడ్డంతోనే మాయమైపోయింది. నేను మాట్లాడించాలని ఆవేళ భోజనాల దగ్గర ప్రయత్నించాను. కాని వినిపించీ వినిపించని వందనాలే నా ప్రయత్నానికి ఫలం.

ఆమె గోడే తలపెట్టలేదు కొన్నాళ్లదాకా. మూడు రోజుల్లో ఆమెను గురించి అంతా తెలిసింది.

ఆమె పేరు అరుణి. వేసంకాలంలో ఓ పల్లెలో గడుపుదామని ఇక్కడ అగిందామె. ఎవరితోనూ మాటాడదట తనకు తోస్తే తప్ప. భోజనం చేస్తున్నా కూడా ఏదో చదువుతుంది.

ఒక సాయంకాలం, చెట్లలోంచి పడుతున్న ఎఱ్ఱ చారలు చూసి వెళ్తుంటే ఆమె కూచుని వుండడం చూశాను తత్క్షణమే లేచి బెదరు చూపులతో వెళ్లిపోయింది. నేను బొమ్మలు వేస్తున్నప్పుడు సాధారణంగా ఆమెని కొండపై చూసేవాణ్ని. బంగారు రంగుతో మేళవిస్తున్న సముద్రాన్ని నీలాకాశాన్ని చూస్తూ నిలుచుంటుంది. ఒక్కొక్కసారి ఆమె గబగబా సముద్రతీరాన్ని నడుస్తుంటే చూశేవాణ్ణి ఆ వాడుముఖంలో పైకుబకని సంతోషం—ఎంచేతో నన్ను ఆకర్షించిందనడానికి వీల్లేదు కాని నాలో కుతూహలం జిజ్ఞాస, కలిగించింది.

నేను ఆ వూరు వదిలి వెళ్లలేకపోయాను. ఆ నిర్మలమైన ప్రదేశాలు వేయి ప్రేమ బంధాలతో నన్ను బంధించాయి. ఈ పల్లె నాలో ఇదివరకు లేని కొత్త ఆవేదన కలిగించింది.—నన్ను అక్కడ ఆపింది కుతూహలం. ఆమెతో స్నేహం చేసి ఈ ముప్ఫైఏళ్ల స్త్రీల హృదయంలో ఏం వుందో తెలుసుకోవాలనే ఆశ—

గమ్మత్తుగా స్నేహితుల మయాంమేము

అప్పుడే ఒక బొమ్మ రాశాను. అద్భుతంగా వుందనిపించింది నాకు. నిజంగా వుంది కూడాను పదేళ్ల తర్వాత వెయ్యి రూపాయలు ఖరీదు చేసింది. కట్టుబాట్టు నియమాలు సడలించి వేసిందది.

'ఒకపక్క నాచుతో కప్పబడిన పెద్ద రాయి. నూనెలా వెలుతురు మడ్డికట్టి జారుతోంది దానిమీద. నా వెనుకున్న సూర్యుని తేజస్సు ఆరాయిపైబడి చలిమంటలా వెలుగుతోంది. ముందు మిరుమిట్లు గొల్పుతున్న వెలుతురు. పక్క సముద్రం.

పట్టలేని ఆనందంతో గంతులేశాను. అందరూ తక్షణమే దాన్ని చూడాలనిపించింది. మాగన్నుగా నెమరేస్తున్న ఆవును చూపించి 'సాధారణంగా ఇటువంటివి చూడవు. చూడు. ఇదేసమయం' అన్నాను. ఆవుబుర్ర పంకించింది.

ఇంటికెళ్ళడంతోనే ముసలమ్మని కేకేసి చూడమన్నాను. ఆమె కళ్లుండీ చూడలేని కళ్ళతో అది ఆవో, ఇల్లో అనుకుంటూ నిలబడింది. అప్పుడే, అరుణి లోపలికి వెడుతూంది. ఆమె ఎలా వెళ్లినా నాచిత్రం కళ్ళబడేటట్టు పట్టుకున్నాను బొమ్మని. ఆశ్చర్యంతో ఆగిపోయింది. ఆమె అనుదినం పట్టపగలు కలలు కనడానికి వెళ్ళేరాయిట అది.

'ఓ' అంది నెమ్మదిగా.

ఆ ఒక్కమాటలోవున్న పొగడ్తకి పొంగిపోయాను.

నవ్వుతూ, 'ఇది ఇప్పుడే పూర్తి చేసాను.'

'మీరు ప్రకృతిని అర్థంచేసుకోవడం అద్భుతం' అంది.

పరవశుణ్ణయ్యాను నేను జయింపబడ్డాను.

'నేను ప్రకృతిని ప్రేమిస్తాను' అందామె తర్వాత. సూర్యాస్తమయానికి తన్మయులమై బయలుదేరాము అప్పుడే ఒకళ్లనొకళ్లు అర్థంచేసుకున్న మనుష్యుల్లా.

ఆమె వొట్టి అమాకురాలుగావున్నా ఆమె హృదయంమాత్రం యౌవనాన్ని, ఉద్రేకాన్ని పోగొట్టుకోలేదు. ఆమె మగజాతిపై చూపని మోహాన్ని, పువ్వులపైనా చెట్లపైనీ చూపుతుంది. చిన్న పిట్టల్ని, ఆవుతోవున్న లేగనీచూసినప్పుడలా ఆమె కంపిల్లేది.

నాతో ఏదో చెప్పడానికి సందేహిస్తోందని తెలుసుకున్నాను. ఆమె సిగ్గుకు నాకే నవ్వొచ్చింది. ఒకరోజు అడిగింది. 'మీరు బొమ్మవేస్తున్నప్పుడు చూడాలనివుంది.' వెంటనే అసభ్యమైన మాట అన్నట్టు సిగ్గుతో ఆమెబుగ్గలు ఎర్రబారాయి. నేను ఒప్పుకున్నాను.

కొంతసేపుండి వెళ్ళిపోయింది మొదట. నేను చిత్రం వేసేటప్పుడు నిష్కంపంగా నా చేతి తిరుగుళ్లే చూస్తూ కూర్చునేది. నడుమ నడుమ 'ఓ' అనేది ఆశ్చర్యం, సంతోషం, మెప్పుమిళితమయేటట్లు. ధైర్యంతో కొన్నాళ్లకి నాతో దినమూ వచ్చేది కొండలపైకి. నేనంటే ఎంతో గౌరవం భక్తీని. నా కాగితంపైనీ అంత గౌరవమూను.

ఆమెతో నేను పాతస్నేహితుడిలాగే వుండేవాణ్ని. కొన్నాళ్ళకి ఆమెలో మార్పు కనిపించింది. మాట్లాడుతూ మధ్యలో మానేసేది. లేచి వెళ్ళిపోయేది. ఇది ఆమెకు పరిపాటే కబోలు అనుకున్నాను. తన కురుకులు సరిగా సద్దుకుంటేనేగాని రావడంలేదు ఇప్పుడు.

వేళాకోళంగా 'మీరు ఇవాళ నక్షత్రంలా మెరుస్తున్నార'నేవాణ్ని. కొంచెం నిజముందేమో అందులో ఆమె ముఖం సిగ్గుతో కొంచెం ఎర్రబారేది.

కొన్నాళ్లయాక నాతో రావడమే మానేసింది. అది పోతుందనుకున్నాను. కాని పోలేదు. మాటలుకూడా తగ్గిపోయాయి. పట్టలేక అడిగాను. 'నేనేమైనా తప్పుచేశానా? ఎందుకీమార్పు' అని. 'లేదులేదు. మిమ్మల్ని ఎప్పుడూ

---

## శీలాన్ని గూర్చి పెద్దల అభిప్రాయాలు.

నాశీలాన్నిగూర్చి జాగ్రత్తతీసుకుంటే గౌరవం తానంతట అదేపాకుతుంది.

—*D. L. Moody*

* * *

గౌరవంలేని తరువాత ఎంత శక్తి సామర్థ్యంవుంటేమాత్రం ఏమిలాభం.

—*Andrea Carnagle*

* * *

సంఘముయొక్క భావి ఆసంఘంలోని ప్రజల శీలంమీద ఆధారపడివుంటుంది.

—*Chamniug*

* * *

శీలం వజ్రకవచమువంటిది. శీలంవున్న వానికి జీవితంలో కష్టాలు ఎన్నివచ్చినా లెక్కవుండదు.

—*Bantol*

* * *

తెలివితేటలకన్నా గుణం ప్రధానం.

—*Emerson*

* * *

శీలాన్ని చెరపడానికి అసంపూర్తిపనులకన్నా అపాయకరమైన పనులువుండవు.

—*David Llyod george*

ఒకలాగే చూస్తున్నాను' అంది.

వింతగా నన్ను చూడ్డం నేను కని పెట్టాను. ఆపేదచూపులో ఏదో పిచ్చి తనం...వెర్రితనం...ముఖ్యం తనకే అర్థంకాని దేనికో బాధ, అపత్రప, కని పిస్తోంది. ఆమె హృదయంలో ఏదో ఆరాటన జరుగుతోంది...ఏంవుందో... ఎవరికి...ఎవరికి తెలుసు ?...

కారణం త్వరలోనే తెలిసింది.

కొద్ది దినాలనుంచి నేను వేకువనే బొమ్మ వ్రాయడానికి పోతున్నాను.

ఒక పెద్ద అగాధమైనలోయ వెళ్ళి వెళ్ళి పర్వతాల్లో కలిసిపోయింది. ప క్కనే సన్ననిబాట. ఇరుప్రక్కలా చెట్లు పరియలను కలుపుతూ ఒక తెలిమబ్బు. దాంలోంచి ప్రియులువచ్చి చెట్లనీడల్లో కౌగలించుకున్నారు. వెనుక బంగారు కిరణాలు చెట్లుకొమ్మల్లోంచి దొంగ చూపులు విసరుతున్నాయి వారికేసి.

వుదయాన్నే సృష్టికూడా కళోపాస నకు అనుగుణంగావుంది. బొమ్మ పూర్తి అయింది. ఆ మంచులోంచి అరుణి నడచి వస్తోంది. నన్నుచూసి తప్పించుకుందా మనే ప్రయత్నం. నేను పిలిచి చిత్రాన్ని ఆమెచేతికి ఇచ్చాను. మాటాడలేదు. తదేకధ్యానలో చూస్తూ నిలబడింది. ఆమె. అకస్మాత్తుగా రెండు వేడికన్నీళ్లు జారాయి ఆమె కోలుకుల్లోంచి దుఃఖాన్ని ఆపుకొని ఆపుకొని, ఉత్సాహాన్ని, ఆవేశాన్ని జయించలేక నిస్సార మైన దానిలా వెక్కి వెక్కి ఏడ్చింది. కారణం కనిపించని ఈ విచారానికి నా హృదయం కరిగిపోయింది. తొందరగా లేచి ఆమెబాధ పోగొట్టుదామనే సా హార్ద్రంతో ఆమె చేతులు పట్టుకున్నా ను. ఆ చేతులు నా చేతుల్లో రెండు నిముషాలువున్నాయి. ప్రతినరం వణకు తున్నట్టు ఆమె హస్తాలు కనిపించాయి. వెంటనే ఆమె తనచేతుల్ని తీసేసుకు— హఠాత్తుగా విదలించుకుంది. ఆ వణకు అగుర్పాటును మాత్రం నేను గుర్తిం చకపోలేదు. ఇది మొదటిసారి కాదు నేను అనుభవించింది.

ప్రేమించిన స్త్రీ గగుర్పాటుందే— ఆమె యువతిగానీ, నడివయస్సుదిగానీ, ధనవంతురాలుగానీ, రైతుబిడ్డగానీ అది నాహృదయంలో సూటిగా నాటుతుంది. నేను అర్థంచేసుకోలేనూ ?

ఆ నిర్భాగ్యురాలు వణకిపోయింది. నేను మాటాడకుండానే ఆశ్చర్యపడు తున్న నన్ను. తప్పుచేసినవాడిలా నుం చున్న నన్ను విడిచి వెళ్ళింది.

ఏమీతోచక, పిచ్చివాడిలా ఏడవా లో నవ్వాలో తెలియక కొండల్ని కో నల్ని తిరిగాను. ఈపరిస్థితి అంత విషా దంగాను, అంత హాస్యాస్పదంగానూ వుంది. నేను నాలో నవ్వుకున్నానే కాని సౌఖ్యమెరుగని ఆమె అసంతుష్టి తో విచారంతో వెర్రిదానిలా వుందని తెలుసుకున్నాను. నేనేంచెయ్యను? ... అక్కడినుంచి వెళ్ళిపోవడం వుత్తమం. తక్షణం......

ఫలహారంచేస్తూ ఆమె-వినేలాగ ముస లమ్మతో 'అవ్వా, నేను వెళిపోతున్నా ను.' ముసలమ్మ ఆశ్చర్యపడింది. 'నువ్వు నాకు అలవాటవుతున్నావు ఇప్పుడే. వెడతానంటావు...' అంది.

అరుణికేసి చూశాను. ఆమె కనుబొ మ్మైనా కదలలేదు. ముసలమ్మ కూతురు నాకళ్ళల్లోకి చూసింది, అప్పుడప్పుడు ఆమెతో హాస్యాలాడేవాణ్ణి— నాలా సంచారంచేసే ప్రతి యువకుడు అంతే......

తోటలో పచారుచేస్తున్నాను.

పగలంతా నన్ను పీడించిన వూహా లు, నేను ఆమెలో అద్భుతమైన గాఢ మైన మోహం కలిగించానన్న స్మృతి. ఆముసలమ్మ కూతురు కొంటెచూపూ, నాలో ఒక మార్పుకలిగించి, నా పెద వులు ముద్దులకోసం వెతుక్కోడం, నా చేతులు కౌగిలికోసం ఆతురతపడడం సం భవించింది. నా ఒళ్ళు జలదరించి, వెన్నెలవలన మనలో కలిగే కోర్కెవుడే కపు దయ్యం నాలో అల్లరిచెయ్యడం మొదలెట్టింది.

చీకట్లు చెట్లని అలముకొని తోట అంతా ఆవరించుకున్నాయి. ముసలమ్మ కూతురు తోటలోంచి వెడుతోంది. అడుగుల్లో అడుగులేసుకుంటూ వెళ్ళి ఆమెను పట్టుకొని ముద్దాడాను, ఇటు వంటివాటికి అలవాటుపడినదేమో ఆమె నవ్వుతూ, పెనగులాడింది.

నేను ఆమెను వదలడానికి కారణం ఏమిటి? తుళ్ళిపడి వెనక్కి ఎందుకు తిరిగాను...! ఎవరో వెనకవున్నారని ఎలా అనుకున్నాను.

ఆమె. ఆ—అరుణి. గదికేపోతూ మమ్మల్నిచూసి, భయపడినదానిలా నిల బడిపోయింది...... చీకట్లలో కలిసి పోయింది.

సిగ్గుపడుతూ బాధపడుతూ, ఆమె ముందు చులకనైపోయాను గదా అని విచారిస్తూ గదికి వెళ్ళాను. నే నుకూనీ చేస్తున్నప్పుడు ఆమె చూసినా ఇంత

బాధపడేవాణ్ణి కాను. పాడు కలలు రాత్రంతా...

ఆమెను ఏముఖం పెట్టుకు చూడను మరునాడు.

ఆమె నాకు కనిపించలేదు. నూతికి నీళ్ళకుపోయిన ముసలమ్మ నూతిలో ఏదో వుందని పొలికేక పెట్టింది. పక్కింటి వాళ్లు గడ్డి పడేశారు కాబోలు... అయినా, చూద్దామని వెళ్ళి వంగున్నాను. ఏమీ కనిపించలేదు నుయ్యి లోతుగావుందేమో? లాంతరు క్రిందికి దింపి చూశాను.

తాడు నాచేతిలో వణకిపోయింది. దీపం నూతిలో నాట్యమాడింది. కాలు కంపించింది. మాటలు గొంతుకలోనే ఆగిపోయాయి.

'ఆమె... ఆమె... అరు...' నాకు తిరిగి జ్ఞాపకంలేదు, మేం శవాన్ని గదిలో పడుకోబెట్టేదాకా నేనేం చేశానో.

ఆమె ముఖం కడుగుతున్నాను. నావేలు ఆమె రెప్పపైబడి రెప్ప తెరచుకుంది. ఆ కన్ను నన్ను చూసినచూపు నేను చనిపోయేదాకా మరచిపోలేను... ఆచూపు...

చేతకాని నాచేతులు ఆమె వుంగరాలజుట్టుని అదో క్రొత్తవిధంగా నుదిటిమీద సరిచేశాయి. సన్నగా పొడుగ్గా వున్న ఒక అస్థిపంజరమది ఇప్పుడు. తోటలోవున్న పువ్వులన్నీ తెచ్చి ఆమెను కప్పాను.

ఆమెకు తెలిసినవాణ్ణి నేను ఒక్కడినే కదూ! ఆమెని అక్కడే దహన పరచమని కోరుతూ ఆమె రాశివుంచిన వుత్తరం...

రాత్రంతా నేను కనిపెట్టుకున్నాను ఆమెని—ఆమె చనిపోయిందనడం నమ్మలేక ఇంకా ఆమె అంటున్నాను.

అయినా ఆమె యాత్మ యానూతిలోనే నశించిపోయింది. దాని కింక సమాప్తి.

జాగరం గడిచిపోయింది. తొలి కిరణాలు యామె పక్కపైపడితే జీవంతంగావున్నాయి. ఇటువంటి సమయాన్నే ఆమె ఎంతో ప్రేమించింది. అప్పుడే లేచిన చిన్నిపక్షులన్నీ పాడుతున్నాయి. కిటికీ తెరచాను. ఆకాశం అంతా మమ్మల్ని ఒక్కసారి చూసింది, మంచుకంటె చల్లనైన ఆమెచేతుల్ని సరిగా సర్ది, ఆకమిలిపోయిన తలని చేతుల్లో పట్టుకొని అప్పటివరకు ముద్దెఱుగని యా పెదవుల్ని ముద్దు పెట్టుకున్నాను. సూర్యుడు దుఃఖాన్ని ఆపుకోలేక ఒక తెల్లమబ్బు వెనుక ముఖం దాచుకొన్నాడు.



రిటైర్డు ఆఫీసరు ఎంకయ్యగారి మొదటి భార్య సంతతి...బొజ్జి.

—కస్తూరి 'అపవాదు'లో వరలక్ష్మి.

# పల్లెపదాలు

[వీనిని సేకరించినది దేవగుప్తాపు వెంకటరమణమూర్తి పంతులు గారు. వీనిని వరి ఊడ్పులలో విశాఖపట్టణం మండలంలోని స్త్రీలు పాడుతారు. 'నోమినోమల్లార నోమన్నలారా చందామామ'' అను పల్లవి ప్రతి చరణము తుదిని పాడుతుండాలి. —సంపాదకుడు.]

తనకళ్ళ కిలువైన కాటికపంచింది
తననొష్ట కిలువైన బొట్టుపెట్టింది
అరువుదిరుగనిసూర్యాహారాలు వేశి
ఆనిలువుటద్దాలా నీడలోజూచి
యిక్కడికి ముస్తాబు యిక చాలునాని

కొడుకునీ చంకనూ వేసుకున్నాదీ
అక్కై వెళ్లూతుందీ బాపనీధులికీ
తరువాత వెళుతుందీ రాచవీధులికీ
అటువెళ్ళి మల్లమ్మ కోమటీధులికీ
ఆవెలమ వీధులికీ వెళ్ళే మల్లమ్మా
ఆతెలగ వీధులికీ వెళ్ళే మల్లమ్మ
ఆగొల్ల వీధులికీ వెళ్ళే మల్లమ్మా
ఆసానివీధులికీ వెళ్ళే మల్లమ్మ
ఆదేవరీధులికీ వెళ్ళే మల్లమ్మ
ఆసాలి వీధులికీ వెళ్ళే మల్లమ్మా
ఆకాపు వీధులికీ వెళ్ళే మల్లమ్మా
ఆరెడ్డి వీధులికీ వెళ్ళే మల్లమ్మ
ఆమాల వీధులికీ వెళ్ళే మల్లమ్మ
ఆమాది గీధులికీ వెళ్ళే మల్లమ్మ
చిన్న వీధులకెళ్ళీ పెద్దవీధులుకీ
అన్ని వీధులకెళ్ళీ తాను మల్లమ్మ
ఓయమ్మలారా ఓతల్లులారా
మామామ మలిరెడ్డీ చెర్వుబోయించీ
ముత్యాలు చెరువూకీ మూకుమనుమల్లూ
వజ్రాలు చెరువూకీ వాలుగొమ్మల్లూ

పగడాలు చెరువూకీ పారుబట్టెల్లూ
నట్టనడుమను చెరువు కలము వేశిందీ
అవ్యకారీచెరువూ నన్నుగోరిందీ
చెర్లోను బడతానూ చెల్లిపోతానూ
కలములోబడతానూ కలిశిపోతానూ

అబ్బలేనీబాలూ డాడొచ్చుతాడూ
నామగడు రాజన్నా దండెల్లినాడూ
చేతులోబెల్ల మెట్టీ చేరదీయండీ
అబ్బలేనీబాలా అనబోకుమండీ
తల్లిలేనోడాని తలచబోకండీ
పెళ్ళినాడు పెచ్చెరువూ నీళ్లుబోయండీ

అనిజెప్పి మల్లమ్మ ఇంటికొచ్చిందీ
పట్టెతో పట్టెడూ పసుపు దీశిందీ
పరిగెపట్టి మల్లమ్మా నూరుకొచ్చిందీ
బంగారు పళ్ళెములో పసుపు పెట్టిందీ
చారడు ముత్యాలు బళ్ళెములబోశీ
అత్తరో మాయత్తా ఉత్తమా కన్యా
నాయత్త దాలెమ్మ నీకు దండములూ
నామామ మలిరెడ్డీ నీకు దండములూ
నాబావ రామయ్యా నీకు దండములూ
యిరుగు పొరుగోళ్లారా దండములు మీకూ

కలమువద్దకి మల్లూ కదలివెళ్ళిందీ
అత్తలూ మామలూ ఆమెతో వెడలీ
ఆదండురాండవ ఆమెతో వెడలీ
కలమువద్దునవారూ గచ్చు దీర్చేరూ
కలమువద్దున మల్లూ నిలుచున్నాదీ
జలజలా ముత్యములూ జలములోబోశి
జలధిపాలకులారా దండమన్నాదీ
ధరణి ఆకాశముకూ దండమన్నాదీ
అష్టాది పాలకులూ దండమన్నాదీ
అరిదివ్య దేవతలూ దండమన్నాదీ
సురకోటి దేవతలూ దండమన్నాదీ
సురలు ముప్పదికోట్లూ దండమన్నాదీ
పంచపాండవులారా దండమన్నాదీ
సూర్యచంద్రుల్లారా దండమన్నాదీ
దండులో రాజన్నా దండమన్నాదీ
నాతల్లి తండ్రులకు దండమన్నాదీ
చంకనున్నా కొడుకూని దించేసినాదీ
కలములో బడ్డాది కలిశిపోయిందీ
అప్పుడే ఆగట్టు ఏరుపడ్డాదీ
కొడుకునీ తీసుకుని యింటికొచ్చేరూ
ఆరాత్రి మల్లమ్మ తానేమిపనులూ
అరాత్రి రాజన్న కలలోనికెళ్ళి
నిశారాత్రివేళ నిద్దురాప్రొద్దూ

కలియగంధారంబూ కానరానేళా
తోడచరిచి రాజన్నకు తెలుపుతున్నాదీ
దిగ్గునా మేల్కాంచీ దిక్కులే చూచీ
ఎటుదిక్కు చూచీనా ఎవ్వరగపడరూ
తెల్లవారినవరకూ తెలివితోనుండీ
తనతోటి సర్దార్లతో జెప్పినాడూ
యింటికెళ్ళీ నేనూ మళ్ళొచ్చుతానూ
ఫించనీ దీసుకుని వచ్చెరాజన్నా
తెల్లవారేసరికి ఇంటికొచ్చేడూ
పలుదోము పుల్లయును చెంబుతో నీళ్ళు
అతనితల్లి దాలెమ్మ అందించినాదీ
నీవిచ్చుతావేమే మల్లేదే తల్లీ
చుట్టాలుగల బొట్టే చూడబోయిందీ
కన్నశారింటికీ వెళ్ళిపోయిందీ
చెంబుతోటీ నీళ్లు అక్కడుంచేడూ
మడమెత్తి పరుగుదా మామింటికెళ్ళి
అల్లంతదూరమునా అత్తనేజూచీ
చెంబుతో వుదకములూ చేతబట్టుకొని
అల్లుడా రాజన్న బాగావున్నావా
అల్లంతదూరానా తనమామఁజూచీ
అల్లుడా రాజన్న బాగావున్నావా
అల్లుడికి పీటేశి కూర్చుండబెట్టీ
పట్టిమంచము వేశి పరుపమర వేశి
మీరందరున్నారూ మల్లేదె అత్తా
ఏమోయి రాజన్న మమ్మడుగుతావూ

నీకుయిచ్చిద్నాడూ కూతుర్ని మరచీ
నోటిపాలూదుడిచీ నీకిచ్చినామూ
పెట్టెలోపలిపసుపుపోటుకుతున్నాదీ
బరిణిలో కుంకుమలూ వెలిశిపోయ్యేయి
పెట్టెలో చీరెలూ చివుకుతున్నాయి
తొలగాని కోకలూ తొలుగుతున్నాయి
పట్టిమంచముమీదపరుపుదిగిపోయి
మాఅత్త మామామూ దండములు మీకూ
మీరందరున్నారూ మల్లులేదాయె
ఎందులో పడిపాయె నావెర్రి మల్లూ
అత్తవారీనోమూ లతిశృంగారమూ
యీనోము విడచేశి ఎందెళ్ళినావే
మడమెత్తి పరుగునా మరి లఘువునొచ్చి
అమ్మరో మాయమ్మ అమ్మ దాలేమ్మా
నుల్లేచె, మల్లేదే, మరి వేగ జెప్పూ
కొడుకురా ఓకొడుకా కొడుక రాజన్నా
వెండిగాదెలధనమూ వెళ్ళిపోతాది
పైడిగాదెల ధనమూ పారిపోతాది
నోటిపాలుదుడిచీ మల్లునేదెత్తి
తోటవేయించిందీ కోడలూమల్లూ
చెరువుబోయించిందీ కోడలూ మల్లూ
నూతులూదీయించే కోడలూ మల్లూ

ముత్యాలు చెరువూకీ మూడునుముల్రా
వజ్రాలు చెరువూకీ వాలుగొమ్ములురా
మీబాబు మలిరెడ్డి చెరువుబోయించీ
కట్టనడమను చెర్వు కలము వేశిందీ
వెండిగాదెల ధనమూ వెళ్ళబోయించీ
పయిడిగాదెలధనమూ బయటబోయించీ
గోలేలతో ధనము గొచ్చియెత్తించీ
తబుకులతో ఆధనమూ త్రవ్విపంచిందీ
నట్టనడమని చిట్టి కలములేయగనూ
ఎన్నెన్ని కోరికలు కోరె మలిరెడ్డీ
ఎన్నికోరికలైనా ఒల్లనన్నాదీ
మూన్నాలు పురటాలూ ముద్దు మల్లమ్మా
మల్లమ్మని స్తేనూ కడుదునన్నాదీ
నీబాబు మలిరెడ్డి ఇంటికొచ్చేడూ
వజ్రాలు నీముఖము వాడియున్నాదీ
వాడియుండినకారణం నాతోడ జెప్పూ
ఈపాటిమాత్రానికి వాడియుంటావా
మళ్ళినా చెయితోనూ అన్న మెడతానా
మరివచ్చి యీయింట్లో మసలబోతానా
బంగారు పళ్ళెములూ కడుగబోతానా
యన్నేనిబోధాలు పరుచుతున్నాదీ
అన్నిబోధలుపరచి మాకుచెప్పిందీ

ఎన్నెన్నిముస్తాబు లాయె మల్లమ్మ
కొడుకూని చంకాని వేసుకున్నాదీ
ఎన్నెన్నివీధులికి వెళ్ళి మల్లమ్మా
అన్నివీధులకెళ్ళీ వచ్చి మల్లమ్మా
పళ్ళెముతో ముత్యములూ పట్టుకున్నాదీ
జలధిపాలకులారా దండమున్నాదీ
చంకకొడుకునిమల్లూ దించేసినాదీ
కల్లములోబడ్డాదీ కలిశిపోయిందీ
చెరువులో బడ్డాది చెల్లిపోయిందీ
అప్పుడే ఆగట్టూ ఏరుపడ్డాదీ
మాఅమ్మ దాలెమ్మా మీకుదండములే

మాబాబు మలిరెడ్డీ నీకు దండములూ
నాఅన్న రామన్న నీకు దండములూ
నాకొడుకు నిచ్చెయ్యే ననుగన్నతల్లీ
కొడుకునీ తీసుకుని వెళ్ళి రాజన్నా
పతివ్రతాయిల్లాలా బాల మల్లమ్మా
నాకు త్రోవివ్వవే ననుగన్నతల్లీ
రెండుపైట్లామెనూ ఆచెరువుగట్టూ
కొడుకునీ రాజన్నా పడవేశినాడూ
ఆ వెనుక రాజన్న పడిపోయినాడూ.

అప్పుడే ఆగట్టూ కల్సుకున్నాదీ
అప్పుడేమన్నాదీ తల్లి దాలెమ్మా
పాలకావుళ్ళొచ్చి పంచనున్నాయీ
పాలుగొందువురా వేకోడలామల్లూ
వెన్న కావుళ్ళొచ్చి వెంటనున్నాయీ
వెన్నగొందువురా వేకోడలామల్లూ
నేతికావుళ్ళొచ్చినిలుచునున్నాయీ
నేయి కొందువురావే కోడలామల్లూ
పండ్లకావుళ్ళొచ్చి పడిపడున్నాయీ
పండ్లుగొందువురా వేకోడలామల్లూ

## ఆంధ్రరమణీమణులు భా-౧

ఇందు—కాకతీయాంధ్రసామ్రాజ్య సింహాసనమధిరోహించి జనరంజకముగ, శత్రుభయంకరముగ రాజ్యమేలిన రుద్రమ్మ; ధరణికోట సింగపుపీఠ మెక్కి అసామాన్యముగ రాజ్యచక్రము త్రిప్పిన గణపమ్మ; ఆంధ్రదేశమున ఆడుదియై పుట్టిన మంత్రిరాక్షసుని అపరావతారముగా నాయకురాలను బిరుదుగాంచిన పలనాటి నాగమ్మ. కౌగిలిలోనున్న భర్తను దీవించి కరవాలమొసగి కదనరంగమునకంపిన మాంచాల; ప్రజారంజకముగ పెద్దాపుర సంస్థానమును పాలించి తురక ఫౌజుదారుని బారి పడకుండ జోహారొనర్చిన అభిమానస్వరూప రాగమ్మ; ఆమె చేతులనుండి ఆమె మనుమని ఏడు మాసముల కసుగందుని గ్రహించి పంచకరపాట్లుపడి అరసి రక్షించిన స్వామిభక్తిపరాయణ మహాలక్ష్మమ్మ; పతియగు రాయజగపతితో సహగమన మొనర్చుచు పతి విరోధియగు ఆనందరాజునకు తిరుగని శాపమిచ్చిన మహాపతివ్రతాతిలకమగు సీతమ్మ; రాణివాసపు స్త్రీలందఱికంటె ముందుగాం దాను కత్తికెరయైన మానమెఱిగిన స్త్రీత్వమునకు మొదలి పేరైన బొబ్బిలిరాణి మల్లమ్మ; నిండు మాలాలయ్య మానసం రక్షణార్థమై నిజప్రాణముల ఖడ్గమున కెరచేసిన రమణమ్మ— వీరలఅద్భుతచరితలు ఆంధ్రాభిమానముతో ప్రస్తరింపబడినవి.

2-వ కూర్పు. 112 పుటలు. దళసరి కాగితములు.
పోస్టుఖర్చులు ప్రత్యేకము. ప్రతి 1-కి అ 8.

## ఆంధ్రరమణీమణులు భా-౨

ఇందు—రణరంగమున వీరవిహారము విరమించి యింటికి వచ్చిన పతికి వీరసందేశమిచ్చి తిరిగి కదనభూమికి పంపి అతనికి వీరస్వర్గమిప్పించిన ఆంధ్ర వీరపత్ని చానమ్మ- మానముకొఱకు, మాటవాసికొఱకు తన్నుతాను పొడుచుకొని చనిపోయిన తంజావూరి తెనుగురాణి రాజగోపాలమ్మ- యీ రాజగోపాలమ్మ మనుమని చెంగమలదాసుని విక్రాంతి సమయమున అరసి రక్షించి తన ప్రభుభక్తిని ప్రకటించిన దాది - మధుర ఆంధ్రనాయక రాజ్యపాలనమును మహనీయముగ సాగించి దాననిరతిని, ఆంధ్రభాషాభిమానమును అతిశయముగ ప్రదర్శించిన మంగమ్మ- చాందాసాహెబు మోసమునకు గుఱియైన మీనాక్షి- పథ్యముముట్టని పచ్చి బాలెంతరాలయ్యు తన సహగమనోద్యోగము నెఱవేరకపోగా పన్నీరు త్రాగి ప్రాణములు విడిచిన పతిప్రాణ ముత్తమ్మ- ప్రజోపయోగమునకై శిశుసహితముగ బలిపోయిన సంగమ్మ వీరల పవిత్రచరిత్రలుగలవు.

దళసరి కాగితములు. 100 పుటలు.
పోస్టుఖర్చులు ప్రత్యేకము. ప్రతి 1-కి అ 8.

## కేయూరబాహుచరిత్ర

శిల్పము మెరయ మంచనమహాకవి రచియించిన కేయూరబాహుచరిత్ర అను పద్యకావ్యమును ఆధారముగ తీసికొని తేట తెనుగు వచనమున జనసామాన్యముకొఱకు వ్రాయబడినది. పెండ్లాడినవానిని సార్వభౌమునిగా జేయు వరమునొందిన మృగాంకావళియను నొకరాజకన్యను కేయూరబాహువను రాజునకు నతని ధర్మపత్నిచే భాగురాయణుడను నాతని మంత్రి నిజబుద్ధిబలమున వివాహముచేయించిన వృత్తాంత మిందలి ప్రధానకథ. నడుమ నడుమ చక్కని నీతికథలు పెక్కులు గలవు.

గ్లేజుకాగితములు. 90 పుటలు.
పోస్టుఖర్చులు ప్రత్యేకము. ప్రతి 1-కి అ 8.

## ఆంధ్రరాజభక్తులు

రాజభక్తి యనుదిన దేశభక్తికి పర్యాయపదముగా రాణించుచుండిన ఆంధ్రదేశపు స్వతంత్రయుగ చరిత్రలలో దీపించు రాజభక్తశిఖామణులగు విశ్వనాథనాయడు, యాచమనాయడు, అబ్దుర్ రజాక్ లారీ, కరిబసవస్వామి, తిక్కన మంత్రి, మహాలక్ష్మమ్మ, పాపారాయడు, హనుమప్ప నాయడు అను ఎనమండుగురి చరిత్రలను కీర్తించు గ్రంథము.

గ్లేజుకాగితములు. 112 పుటలు.
పోస్టుఖర్చులు ప్రత్యేకము. ప్రతి 1-కి అ 8.

ఆంధ్రభూమి బుక్కుడిపో, వేపేరి, మదరాసు.

# గొడ్డుగేదిసివాలు

అప్పులకుమల్లే ఈనకపోయినందుకు పోషణలో యజమాని చూపిన అలసభావం వ్యక్తంచేస్తోంది ఈఆత్మకథ.

రచయిత:

## కాస్యపి

మా అమ్మకు నేను నాలుగోదాన్ని. మా అమ్మ బాగా మూడు సేర్ల పాలు యిస్తూవుండే. మంచి సాంప్రదాయంలో పుట్టాను మా యజమాని అతి ఆప్యాయంగా పెంచేవాడు. నేను పెద్దదాన్ని కాకండానే ఆ యజమాని స్వర్గానికి వేంచేశాడు.

నాకు ఐదేళ్ళు నిండాయి. అంతవరకు చూడుకోకపోవడంవల్ల నన్ను గొడ్డుగేదిక్రింద కట్టేశారు.
దీనికి మేపడం శుద్ధ దండగఅని చెప్పి బీటులోకి కూడా పోనియ్యకుండా బందుచేశాడు. తాడు తెంపుకుని ఎప్పుడైనా చొరబడతానని కాబోలు పెద్ద భారమైన తుమ్మదుక్క నామెడలో కట్టారు. ఆ దుక్క ఈడ్చుకుంటో బొల్లిదిబ్బలంట మేస్తూ వుండేదాన్ని. కొంత కాలం గడిచింది.

బొల్లిదిబ్బలంట తిరుగుతూవున్న ఒక్క దున్నపోతూ నావంక చూచేదికాదు.

దమ్ములుచేసే కాలంవచ్చింది. నన్ను ఒక దున్నపోతుకి లంకెవేసి దంపనాగలి మెడకు కట్టారు.

పచ్చగడ్డి పత్తిగింజలు, ఉలవపిండి తెలగపిండి, ఉలవపొట్టు, కందిపొట్టు కమ్మగాతిని తాపీగా నెమరువేస్తూ మాయప్పలా పడుకుందామనుకున్నాను కాని నేను గొడ్రాలనవుతాననుకుని ఎన్నడూ అనుకోలేదు. విధి ఇట్లా నన్ను గొడ్డుగేదిక్రింద చేసి దుక్కిలో చిక్కులు పడమన్నాడు.

ఆడకూతురు కదా అన్న కనికరమన్నా లేకండా ఆ ద్విపాద పశువు-పాలికాపు-తనకాపు నన్ను దుక్కిలోపెట్టమన్నాడని ముల్లుకర్రతో పొడిచి పుండుచేశాడు. మునుపు ఎన్నడూ ఎరగనిపనిలో పెట్టి నన్ను నలుపుతూవుంటే శక్తిలేక వెనుకడుగువేస్తే వెనకాల అరక తన వెన్నెముకకు గుచ్చుకుందన్న కోపంతో పాలికాపు నా వెన్ను చిట్లగొట్టాడు. కర్కోటకుడు.

ఆ ద్విపాదపశువుకి అక్కాచెల్లెండ్రు లేరూ? వారిలోమాత్రం గొడ్రాండ్రు లేరు మానవుల్లో వున్న గొడ్రాండ్రను ఇట్లా చిత్రవధలు చేస్తున్నారా. ఎందుకు చేస్తారు. వారి అడుగులకు మడుగులొగ్గుతారు. మహర్షులుకూడా ఆ మగనాలకి పాదాక్రాంతులవుతారు. వారికి సభలలోను విందులలోను అగ్రతాంబూల మిస్తారు.

మా అప్పలవలె పదికాన్పులు కలిగిన మహా యిల్లాండ్రను 'పెద్దగేది' అని యీసడించుకుంటారు.

పిల్లలు ఏ సభలలోనైనా నాటకాలోనై సినిమాలలోనైనా ఏడిస్తే ఎందుకురా గేద్దూడలా అల్లా అరుస్తావని చీదరించుకుంటూరు. తమలోవున్న వంధ్యత్వాన్ని అంతగా ఆదరించి ఆ నరపశువులు నా వంధ్యత్వాన్ని యింత హేయంగా చూడటంలోనే వారి పశుత్వం గోచరిస్తోంది.

పోనీ గొడ్రాలివెంట యువజనం ఎగబ్రాకేటట్టు నా వెనుక ఒక దున్నపోతైనా రాదుకదా! అందుకనే యింటగెలిచి రచ్చగెలవమన్నారు. పది యీతలు యీనమా అమ్మమకోసం కుమ్ములాడతాయి కాని ఆ దున్నపోతులు నన్ను

ఒక్కసారయినా మాచూడవదేం పాపమో! పది దున్నపోతులు నా వెంటబడితే నేనుమాత్రం సంతానవతిని కాకపోయానా ?

ఇట్లా అనుకుంటూవుండగానే పొద్దు కుంకింది.

సాయంకాలం ఆరుగంటలవరకు దమ్ములో పెట్టి చాదకొట్టేసి అరక విప్పేసాడు ఆయములాడు.

ఆరాత్రి పశువులదొడ్డి దగ్గరకు వెళ్ళేసరికి మా అప్ప కుడితి తాగుతోంది. పత్తిగింజలు దేవుకు తింటోంది నాతో దుక్కిదున్నినపోతులకు ఎడ్లకు జంగిడీలలో ఉలవ గుగ్గిళ్ళు తెచ్చిపెట్టాడు. నేను చపలత్వంచేత గోలెవెంపు సాగాను. మా అప్ప కొంచం బుసకొట్టింది కాని పిల్లలతల్లి కనుక కొంచం జాలిపడి వూరుకుంది.

ఒక గుక్రెదుచిట్టు తీసుకున్నాను గోలాంలోది ఏ మూలనుంచి వచ్చాడో ముట్టి బద్దలయ్యేటట్టు బడితె కర్రతో నామూతి బద్దల కొట్టాడుపాలేరు.

భగవంతుడా ! ఎందుకునన్నీ పశుజన్మ ఎత్తించావు. ఎత్తించావుపో ఈ వంధ్యత్వం ఎందుకు తెచ్చిపెట్టావు అని విలపించాను. అభగవంతుడు అందరికీ పలుకుతాడా.

అన్ని కట్రాటలవద్దా పచ్చగడ్డి పడేసాడు. నా కట్రాటవద్ద ముక్కిపోయిన వట్టిగడ్డి పడేసాడు. ఇంత వలపక్షం ఎందుకు పెట్టావు తండ్రీ.

వచ్చే జన్మనికైనా మానవుల్లో గొడ్రాలిగా పుట్టించుగాని పశువుల్లో గొడ్రాలితనం పగవాళ్ళకయినావద్దు తండ్రీ అని పరిపరి విధాల ప్రార్థించాను! దయరాలేదు.

వెన్నుమీద దెబ్బలు మంట్టలెత్తుతున్నాయి. కటికివాడే నాకని కరిస్తాడు కాని యీ కాపుకి కనికరం లేదే బ్రతికివుండి నేను అనుభవింప గలిగిందేముంది తండ్రి అని పిలపించాను కడుపుమంటచే పచ్చగడ్డికై ప్రాకులాడాను ముందుకు పడిపోయాను. మెడకుకట్టిన కన్నితాడు బిగుసుకుపోయింది. నా ఆత్మశాంతి ప్రదేశంచేరింది. కాళ్లు బిర్రబిగుసుకుపోయాయి.

మరునాడు తెల్లవారు ఝామునే మా కింకరుడు కాడిచేత పట్టుకొని చీకట్లో బిర్రబిగుసుకొనివున్న నా దేహాన్ని బాగా శుద్ధి చేశాడు. దండంవచ్చి నా డొక్కలో తగిలింది. డప్పులా వాగింది. ప్రకృతిఅంతా లేచింది. కాకులు కావుకావు మన్నాయి యజమాని భార్య వృద్ధురాలు నా అవస్థకి వగచింది. ఆ పాలికాపుకి కడుపునిండింది.

---

౩౨౦-వ పేజీ తరువాయి.]

పెర్షియన్ బాలికలకు పుట్టగానే పెళ్ళిబేరాలు జరుగుతాయి. అందుకనే దగ్గర సంబంధాలు ఎక్కువగావుంటా అదేశీయులలో. పుట్టగానే అడపిల్లకు జరీగుడ్డ ఒక వుగరం ఒక జోళ్ళజత, పట్టుశాలువా పంపిస్తారు. అసంబంధం పిల్లతల్లికి యిష్టమైతే అ జరీగుడ్డ అ ఉంగరం తీసుకుంటుంది.

లేకపోతే తిరగొట్టేస్తుంది. అట్లా చిన్నప్పుడు పసుపూకుంకుమలు పుచ్చుకోకపోతే పెద్దదైన వెనుక పెళ్ళికొడుగ్గారింటికి విందుకు పిలచి ఆమెకు తెలియకండా మగపిల్లవానిని దూరంలోనుంచి చూపిస్తారు. ఇరువురికి యిష్టమైతే ముల్లావచ్చి ఆ వివాహాన్ని రిజిష్టరు చేస్తాడు.

బహుభార్యాత్వం అమోదించినా యిప్పుడు అది అంతవిరివిగా లేదు.

ఇరాన్‌లో రత్నకంబళములు శాలువలు పరిశ్రమ విరివిగానున్నది. అవి ఎక్కువగా స్త్రీలే చేస్తూవుంటారు.



# మణిమాల



## శ్రీ మద్రామానుజాచార్యులు ఆంధ్రుల

శ్రీమద్రామానుజులవారు ఆంధ్రులనుటకు నిదర్శనములు.

౧-శ్రీమద్రామానుజులు ముప్పాతిక కాలము శ్రీరంగంలో ఉన్నను వారు అరవవారైనట్లయిన శ్రీరంగనాధుని అరవములో స్తుతించి ఒక్క పాశురమైనను రచించలేదు —వారిగద్యత్రయము సంస్కృతములోనే ఉన్నది.

౨-వారి శ్రీభాష్యమును ఎదుటనున్న శ్రీరంగనాధునికి కృతియివ్వుటకు మారుగా చాలాదూరములోనున్న తెనుగు రాయడని ప్రసిద్ధిగాంచిన శ్రీనివాసమూర్తికి (అనగా తిరుపతి వెంకటేశ్వరునికి) అంకితమిచ్చుట వారి ఆంధ్రాభిమాన సూచకము.

3-కాశ్మీరదేశములోని శారదా పీఠములో శ్రీరామానుజులవారి బ్రహ్మసూత్ర భాష్యానికి శ్రీభాష్యమను బిరుదమీయబడెను-అచ్చట మూలప్రతి యిప్పటికిని ఉన్నది-అది భూర్జపత్రాలపై ఉన్నది-దానిలోని లిపి తెనుగులిపి.

౪-శ్రీరామానుజులవతరించిన గ్రామం శ్రీపెరుంబుదూరు-అది చెంగల్పట్టుజిల్లాలోనిది-అచ్చట విశేషంముగా ఆంధ్రమే మాట్లాడువారున్నారు-ఈజిల్లాలోని శ్రీవైష్ణవులను 'వడమల' వారనిపిలుతురు-అనగా ఉత్తరాదివారని అర్థము-వడమల ముదిరితే వైష్ణవము అని అరవవారనుచుందురు-చెంగల్పట్టు చత్తూరుజిల్లాల ఉత్తరభాగము ఆంధ్రదేశము-శ్రీరామానుజులు వడమలబ్రాహ్మణులని పిలువబడుచుండిరి.

౫-ద్రావిడులకు ప్రాయికముగా ఇంటిపేరులు లేవు-ఆంధ్రులకు ఇంటిపేరులు ముఖ్యము- రామానుజులవారి యింటిపేరు 'ఆసూరివారు' దీనిచేవారు ఆంధ్రులనుట స్పష్టము- ఆసూరివారి ఇంటిపేరులుగల కుటుంబాలు కృష్ణా-గుంటూరు- నెల్లూరు జిల్లాలలో ఇప్పటికినీ ఉన్నవి. శ్రీరామానుజులవలెనే వీరందరును హారీతగోత్రజులే- కందాళ వారు ఆంధ్రులు- ముడుంబవారును ఆంధ్రులు- తిరుమల అనుఇంటిపేరుగలవారు ఆంధ్రులే.

శ్రీపెరుంబదూరిలోని శ్రీరామానజ భాష్యకారుల ఆలయములోను తిరుమల శ్రీనివాసమూర్తి సన్నిధిలోను నిత్యోత్సవ వైభవాదులు ద్రావిడాచార సౌరమాన ప్రకారంకాక ఆంధ్రదేశీయ సమయాచారమగు చాంద్రమానప్రకారమే ఆకాలమునుండి నేటివరకును జరుగుచున్నవి-శ్రీనివాసమూర్తి సన్నిధిలో ఆంధ్రముడుంబై వారికి స్థానాచార్యాది మర్యాదలున్నూ రామానుజులసన్నిధిలో ఆంధ్ర విక్రాలవారికి అట్టిమర్యాదలున్నూ జరుగుచున్నవి.

ఈ కారణాలచేత శ్రీమద్రానుజుల వారు ఆంధ్రులేయని స్పష్టమగుచున్నది.

—గోలకొండ.

* * *

## తులసీ మహాత్యం

1. తులసి- Ocimum Sanetum) holy basil అని ల్యాటిన్ ఇంగ్లీషు పేర్లు.

ఇది సర్వదా ప్రాణవాయువు (Oxigen) ను విడుచుచుండును. గనుక మిక్కిలి ఆరోగ్యకరమైనది. కావుననే ప్రతి యింటను తులసికోట నిర్మించి తులసిని పూజించి, దానికి ప్రదక్షిణములు చేసి, తులసీతీర్థమును గ్రోలవలెనని యార్యుల సిద్ధాంతము మూఢజనులకు శాస్త్ర సంబంధమగు కారణములు (Scientifical Reasons) బోధపడవు గాన భక్తి రూపమున శ్రద్ధకలుగుటకు ఈ విషయమై కొన్ని గాథలు కల్పింపబడినవి.

పెరటిలోను యింటి సమీపముననుతులసి విస్తారముగ నున్నయెడల అది గాలిలో వచ్చెడి విషవాయువులను హరించి గాలిని ప్రాణవాయువుతో నింపిపరిశుద్ధము చేయును. తులసిదళమును తినుటవల్ల అజీర్ణము, నులిపురుగు, జర్వము మొదలగు రుగ్మతలు హరించును, తులసిని ఆఘ్రాణించుటవల్ల గూడ ఆరోగ్యము కలుగును.

ఇటువంటి కారణములవల్లనే భగవంతుని తులసీదళములతో పూజించి, ఆ నిర్మాల్యము నాఘ్రాణించి, శిరమున ధరిలపవలెననెడి ఏర్పాటు. ఇటులనే భక్తి పుణ్యము పాపము అను మాటలలో ఆరోగ్యవిషయమై ఆర్యులు బోధించిరి.

అవి బాదస్తమని గాని మూఢభక్తియని గాని నిరాకరింపరాదు.

లక్ష్మీ తులసియు కృష్ణతులసియు సమానగుణములు గలవియే భూతులసి రామతులసి యనునవికూడ వాయువను పరిశుద్ధము చేయును. వీని సుగంధమువల్ల ఈగలు దోమలు చేరవు.

* * *

## పసుపు ప్రభావం

2. ఇండియా దేశములో (ఉష్ణప్రదేశములోని) స్త్రీలు తఱుచు నీళ్ళలోను, తేమలోను మసలుచుందురు గాన ఆ కాళ్ళనుండి చలువ (శైత్యము) శరీరమునకు వ్యాపింపకుండుటకు అరకాళ్ళకు పసుపు రాచుకొనుట పూర్వాచారము. ఆ యాచారమిపుడు మీగాళ్ళకు పసుపు రాచి పారాణి పెట్టుటగా మాఱినది. దానితోపాటు అఱిగాళ్ళకుకూడా పసుపు రాచుకొనుట మంచిది. ఈ పసుపు పారాణి మంగళప్రదమనియు సువాసినీ చిహ్నమనియు నిప్పటివారల అభిప్రాయము. సువాసినులు ముఖమునకు పసుపు రాచుకొనుటవలన వెంట్రుకలు (మీసములు) గాని మొలువవు. ఒడలునిండ పసుపు రాచుకొనుటవల్ల (దరిద్ర చిహ్నములని చెప్పబడు) పిక్కలమీది రోమములును మొలువవు. శరీరమునకు ఉష్ణమును కలిగించును. మిక్కిలి ఆరోగ్యకరము.

పసుపునందు సూక్ష్మజీవులను Germs చంపునట్టియు, జీర్ణశక్తి కలిగించునట్టియు సుగుణములు గలవు. కావున కూరలలోను చారు ధప్పళములలోను కొలదిగా పసుపుగూడ నుపయోగించిట ఆరోగ్యకరము.

* * *

## ఎర్రల ఉపయోగం

మనదేశంలో ఎర్రలను గేలాలకు గుచ్చి చేపలను పట్టడం అందరూ ఎరిగిన విషయమే.

అట్లు ఎరగా బలియగుచున్న ఎర్రల మహోపయోగం ప్రపంచానికి వెల్లడించాడు డా॥ జార్జి షెఫీల్డ్ ఆలివర్ మహానీయుడు.

ఆలివర్ ముప్పైయేండ్లుగా పరిశోధన చేసి వ్యవసాయంలో ఎర్రల ప్రముఖ సహకారస్థానాన్ని కనిపెట్టాడు.

ఈరోజున అమెరికాలోని కాలిఫోర్నియాజిల్లాలో లాస్ ఏంజల్సు ప్రాంతములోటన్నులాదిగా ఎర్రలను పెంచి ఎగుమతి చేస్తున్నాడు.

రకరకాల ఎర్రలు రకరకాల భూములకు ఆముదంపిండి, పి. యస్సు. పిండి, మొదలగు ఎరువులలాగే విరివిగా వుపయోగిస్తున్నారు అమెరికాలో.

ఈ ఎర్రలనే మనవారు వానపాములనికూడా అంటారు. ఇవి భూములను దొల్చి గుల్ల చేసి వ్యవస్యానికి అనువుగా చేస్తాయి. ఎర్రలువున్న ప్రాంతతలో దుక్కి ఎక్కువగాదున్న నక్కరలేదు. ఎర్రలు భూమినిదొల్చి మట్టినితిని మట్టిని విసర్జిస్తాయి. ఆ విసర్జించిన మట్టిలో వృక్షజాతులకు కావలసిన ప్రాణవాయువులు నత్రజని మొదలగు పదార్జము మిళితమై యున్నవి. ఎర్రలు తయారుచేసిన ఆ సొరంగములలో తేమనిలువయుండి ఆ ప్రాంతములలోని వృక్షములకు సరఫరా చేయుచుండును. భుగర్భములో కుళ్ళుచున్న ఆకులు, గడ్డి మొదలగు వాటినితిని మట్టిగా చేయును.

అందుచేత అమెరికాలో యిప్పుడు వ్యవసాయములలో ఎర్రలను ఎరువులుగా నుపయోగించి అమిత లాభమును పొందుచున్నారు.

ఈ మధ్య పూవుల తోటలను పండ్లవనములకు ఎరువుగా వుపయోగించి పంటలను వృద్ధిచేసినట్లు తెలుస్తోంది. ఒక జాతి వృక్షములను మామోలు ప్రదేశంలోను ఎర్రలు ఎరువువేసిన ప్రదేశంలోను నాటి వాటి పంటలు సరిపోల్చి చూసారు. ఎరువువేసిన ప్రదేశంలో నాటిన వృక్షం బాగా విస్తరించి పెరిగింది. దాని పంటకూడా రెట్టింపు లభించింది.

ఒక ఎకరానికి ఎర్రలను ఎరువుగా ఉపయోగించడానికి రెండున్నర మిలియన్ల ఎర్రలు కావాలని ఆలివర్ అంచనా వేసాడు.

ఈ ఎర్రలు కోళ్ళకు, బాతులు, మొదలగు పక్షులకు ఆహారంగా కూడా ఉపయోగ పడుతున్నాయి. వానపాముల నుండి ఒక విధమైన తైలంకూడా తయారుచేస్తున్నారు. అది ఔషధవస్తువుగా ఉపయోగపడుతోంది. వ్యవసాయానికి ప్రముఖ స్థానమంవహించిన హిందూదేశంలో వ్యవసాయాభివృద్ధికి ఎర్రలు అత్యవసరం.

Printed at the Andhrabumi Printing Works, 36 Mukatal Street, Vepery P.O, Madras.
Editor & Puablisher : Andra Seshagiri Rao B.A.